

*Chandamama Oct. '47*

*Photographed by Marcus Bartley*

(1) సరసం

## చదువుకోండి



ఇంకా, ఇంకా, ఎన్నో!

---


సాలు చందా 5-0-0

# చందమామ

విడిప్రతి 0-6-0

పిల్లల మాసపత్రిక


చందమామలో పిల్లల రచనలూ, పిల్లల ఫొటోలూ ప్రకటిస్తాము. చక్కని ఫొటోలు కార్డు సైజులో తీయించి 0-0-9 బిళ్ళతో పంపాలి. ఫొటో ప్రకటిస్తే ఉంచుకుంటాము. లేకపోతే తిప్పిపంపుతాము. అచ్చుపడని రచనలు తిరిగి కావాలంటే కవరుమీద తమ అడ్రసు రాసుకుని బిళ్ళ అంటించి, వ్యాసంతోపాటే మాకు పంపాలి. లేకపోతే మేము తిప్పి పంపలేము. ఉత్తర ప్రత్యుత్తరాలు పెంచి లాభముండదు. ఈ విషయాలు ముఖ్యంగా గమనించి మాకు సహాయపడమని మా ప్రార్థన.


ఆఫీసు :

37, ఆచారప్పన్ వీధి : మద్రాసు 1

# చందమామ

పిల్లల మాసపత్రిక

సంపుటి 1 | 2 అక్టోబరు 1947 | సంచిక 4



## బాలకుల దీవెనలు బ్రహ్మ దీవెనలు!

పాపలూ!

అక్టోబరు రెండు గాంధి తాతయ్య పుట్టినరోజు. ఆనాడు మనదేశమంతటా ఉత్సవాలు జరుపుకుంటారు. గాంధి మహాత్ముడు చిరంజీవికావాలని అందరూ కోరుకొంటారు. కాని అవి పెద్దల కోరికలు, ప్రార్థనలు. పిల్లల దీవెనలు కావు. గాంధి తాతయ్యకు నూట ఇరవై అయిదు ఏళ్ల బ్రతకాలనిఉంది. మీ బాలకులంతా కలిసి ఏకగ్రీవంగా గాంధి తాతయ్యను దీవించండి. ఆయన నూట పాతిక ఏళ్లు బ్రతుకుతాడు. వారికోరికా యీడేరుతుంది, మనదేశానికీ మేలు చేకూరుతుంది.

# భోగి - ఉండ్రాళ్ళతద్దె

డీవి భానుమతీదేవి

భోగిపండుగనేడు ముత్యాలతల్లి
వేగవే గోరింట పెట్టుకోవమ్మ
చిన్నారి చేతిలో శ్రీకారమిడుదు
పాదాలగోరింట పారాణిపెడుదు
చిట్టిముట్టాడితే శ్రీకారమిడను
బావురుమంటేను పారాణియిడను
పసితల్లి అరచేయి పగడాలరేకు
చిటితల్లి పాదాలు చెంగల్వపూలు
అదరిపడకండమ్మ అదరిపడకండి
అంతలోనేపండు అమ్మాయిచేయి



★

ఉండ్రాల తద్దాయె, యివ్వాళమనకు
ఊగవే ఉయ్యాల మాయమ్మనీవు;
ఉయ్యాలలోనీవు వూగకుంటేను
ముసలిమొగుడబ్బునే మురిపములతల్లి
తద్దెపండుగనేడు ప్రొద్దెక్కెనమ్మ
నిద్దురవీడిరా నాముద్దుతల్లి!





# నా ఆత్మ కథ

చందమామ

"జయాబ్ధి జయీభవ! దిగ్విజయీ భవ!" అంటూ మీరంతా రంగురంగుల విల్లంబులు పట్టుకొని దసరా పండుగకు బయలుదేరుతారు. మీలో ప్రతివారు కొత్తదుస్తులు తొడుక్కుంటారు. ఎన్నడూ బడికి వెళ్లనివాళ్లుకూడా ఆ పండుగకైనా తప్పకుండా బడికి వెళ్లతారు. ఎంత మొద్దబ్బాయికైనా "ధర సింహాసనమై" అన్న పద్యం వస్తుంది. లేదా, "అయ్యవారికిజాలు అయిదు వరహాలు, పిల్లవాండ్రకు జాలు పప్పుబెల్లాలు," అన్న రెండు చరణాలైనా పట్టుబడుతాయి.

దసరా పండుగ వస్తున్నది అనగానే మీలో చాలమంది కోలాటపు కర్రలు, విల్లంబులు, కోతులు సంపాదించటానికి ఇంట్లో ఎంతైనా గోల చేస్తారు. గులాములోవేసే తుంగగడ్డల పొడికోసం మీరు ఎన్ని తంటాలైనా పడిఉంటారు.

"మామయ్యా, యివి ఎప్పటి సంగతులు?" అని బస్తీ కుర్రవాళ్లు నన్ను వెక్కిరించవచ్చును. వాళ్ళకు నేను చెప్పగలిగింది ఒక్కటే. పల్లెటూళ్ళల్లోని వీధిబళ్లకు ఒకసారివెళ్ళి చూచిరమ్మంటాను. ఈ రోజుకుకూడా కోలాటాలు కనిపిస్తాయి. పిల్లల దిగ్విజయ నాదాలతో వీధులు దద్దరిల్లుతుంటాయి. ఇంత కోలాహలం ఎందుకు జరుగుతున్నదో, మనవాళ్ళు దసరా పండగ ఎందుకు చేస్తున్నారో మీకు తెలుసునా?

మహర్నవమినాటికి వానలు వెనుక



బట్టిపోతాయి. శరదృతువు ప్రారంభ మౌతుంది. ఆకాశంలో నీలమేఘాలు కనిపించవు. దూదిపింజలులాగా తెల్ల మబ్బులు అక్కడక్కడ ఉంటాయి. రాత్రింతలు వెన్నెల అప్పుడేపిండిన ఆవుపాలలాగా ప్రసరిస్తూ ఉంటుంది. బురదఉండదు. చేలు పైరుపచ్చలతో నిండి కళకళలాడుతుంటాయి.

పరరాజులమీదికి దండెత్తటానికి ఇదే మంచి అదను. సైన్యాలతో తరలి పోవటానికి వానలు వాగుళ్ళు అడ్డురావు. నదులు ఏళ్ళు సన్నగిల్లి ఉంటాయి. అందువల్ల తేలికగా దాటిపోవచ్చును. సేనకు కావలసిన ఆహారపదార్థాలు తేలికగా లభిస్తాయి. రెండు మూడు నెలల పాటు యుద్ధాలుచేసి జయించేనాటికి చేలు విరగపండి ఉంటాయి. శత్రువుల ధన ధాన్యాలు అప్పుడు తేలికగా దోచి తెచ్చుకోవచ్చును. ఈ వీళ్లను చూచుకొనే పూర్వంరాజులు విజయదశమినాడు దిగ్విజయ యాత్రకు బయలుదేరేవాళ్ళు. పూర్వం శ్రీరామచంద్రుడు రావణుని మీదికి ఈ ముహూర్తాననే దండెత్తి వెళ్ళాడు. విరటుని గోవులు కాజేసిన





కౌరవులమీదికి అర్జునుడు ఈ దశమి నాడే బయలుదేరి దారిలో జమ్మిచెట్టు మీద దాచిన గాండీవం పుచ్చుకొన్నాడు. అందుకనే మనం విజయదశమినాడు శమీ (జమ్మి) పూజ ఆయుధపూజ జరుపుతాము.

ప్రజలలో ధైర్యశౌర్యాలను పెంపొందించటానికి, మనపెద్దలు మహర్నవమి ఉత్సవాలు జరుపుతున్నారు. ఈ సంప్రదాయం మన దేశమంతటా ఉంది. ఈ సంగతి మీరు మరచిపోకండి. మనకు స్వాతంత్ర్యం వచ్చింది. ఈ రోజుల్లో విల్లమ్ములతో యుద్ధంచేయనిమాట నిజం. మనకు మనమే రాజులం, మనకు మనమే ప్రజలమన్న మాట నిజం. అయినా యీ సంప్రదాయాన్ని మరచి పోగూడదు. అసత్యం అధర్మంతో పోరాటం మనకుఉండనే ఉంది. ఇవి ఎప్పటికప్పుడు కొత్త కొత్త అవతారాలెత్తి మనమీద దండయాత్ర చేస్తుంటాయి. అందువల్ల మనం సిద్ధంగా ఉండాలి. మన ధైర్య సాహసాలు పెంపొందాలి. ఇది జ్ఞాపకం ఉంచుకొని విజయదశమి జరపండి.



# జయాభి జయీభవ - దిగ్విజయీభవ

ఓ భారతీయుడా ఓ యాంధ్రవీర !
మనజాతి యగచాట్లు మరువబోకోయి
మనవారి శౌర్యమ్ము మరచిపోకోయి!
వర్తకమ్మునకని పాశ్చాత్యులిటకు
విచ్చేసి కోటలు పెట్టించినారు
అదిచూచి మనవార లడలించియుడుగ
ఆత్మరక్షణకంచు అచ్చికాలాడి
నమ్మించి వంచించి నారయా దొరలు
సేనల విరివిగా చేరంగదీసి
క్రమముగా దేశమ్ము కాజేసినారు.
అధికార మారీతి అబ్బినయంత
జాతీయవృత్తుల సమయించినారు
రాణివాసములోని రత్నాలుమణులు
బండారములలోని పైడినాణెములు
సీమకుబంపిరీ స్టీమర్లలోన
మరనూలు బట్టలు మన దేశమందు
గుప్పించినారయా కోకొల్లలుగను
మనవారి సరకులు మన దేశమందె
అమ్ముడుపోకుండ ఆకట్టివారు
సన్నవల్వలు నేయు సాలీలబిలిచి
చేతివ్రేళ్లనువారు ఛేదించినారు
జాతిచదువులుచెప్ప సంస్థలన్నిటిని
మూసివేయించిరీ మోమోటలేక
ఆసంస్థలధనమ్ము లపహరించిరిగ
సేద్యంపుటొనరులు చెడిపోయిరైతు
మొరవెట్టుకొన్నను ముసిముట్టరైరి
పండిన పంటైన ప్రజకందకుండ
చేర్పించినారయా సీమకు దొరలు
ఇట్టి తంత్రాలతో ఈ దేశమెల్ల
అల్లకల్లోలమై ఆగమైపోయె
క్షామదేవతయంత గజ్జెలుకట్టి
ఆమూలనుండియు ఈమూలదాక
తైతక్కలాడుచు తారసిల్లినది
అజ్ఞాన రాక్షసి ఆవహించినది
ఏమూలజూచినా ఏడ్పుబొబ్బలుర
అదిచూచి మనవార లల్లాడినారె
మనసులోపల నెంతో మ్రగ్గిపోయారు
ఎటువంటిదేశాని కెటువంటిదశలు ?
ఎటువంటి జాతికి ఎట్టియిక్కట్లు ?
ఎటువంటి సంస్కృతి కెట్టిదుఃస్థితిర ?
అనుచు లోలోపలే అలమటిల్లారు
పారతంత్ర్యమువల్ల ప్రభవించెనిద్ది
దొరలనందర పారద్రోలబోకున్న
ఈగతిపోదయ్య ఈగడ లేదు
మనజాతి కింకను మర్యాద లేదు
ఒడలిలోపల నెత్తురుండునందాక
ముక్కున నూర్పులు పొలయునందాక
ఈపట్టిన కృపాణమిక దింపబోము
భారతమాత నీ పాదమ్ములాన
అని ప్రతిజ్ఞలుచేసి యా ఝాన్సిలక్ష్మి



మొదలైన యోధులు కదలి ఆంగ్లేయ
సేనల నెదిరించి చెండాడినారు
పోరాట మీరీతి ఘోరమ్ముగాను
సాగించుచున్నంత శౌర్యమ్ము ద్రెల్లి
తెరవేది మనకంచు తెల్లదొరలుండ
స్వార్థంబుగోరిన సంస్థానపతులు
దేశగౌరవమైన తిలకింపకుండ
స్వాతంత్ర్య భాగ్యమ్ము సమయునంచనక
యుద్ధమ్ము చేసిరీ ఒరులతో గలిసి
దానితో మనవారి తంత్రంబు సెడియె
జాతీయ యోధుల సన్నాహమణగె
పరులకు దేశమ్ము స్వాధీనమయ్యె
నాటి స్వాతంత్ర్య రణమ్ములోపలను
ఎందరుమన్నీలు ఇలకొరిగినారో
చెప్పలేక చరిత్ర చిన్నవోయినది.
ఆపైని యుగచాట్లు అన్నిన్ని కావు
దారిద్ర్య దేవత తండనాలాడె
ఓయనిపిల్చినా కోయనిపల్క
ఇది చూచి మనవారలిక సైపలేక
కాంగ్రెస్సు పేరుతో ఘనమైన సంస్థ
స్థాపించినారయా జాగృతి తెచ్చి
స్వాతంత్ర్యమని ప్రజ పరవళ్లు త్రొక్క
ఈ దేశమంతాను మాదెయన్నారు
మాయింటి పెత్తనము మాదెయన్నారు
ఉప్పుపై పన్నింక ఓర్చమన్నారు
కాంగ్రెస్సు పగ్గాలు గాంధిజీ పట్టె
విజయుని పోల్కగా వీరజహ్వారుడు
పూరించె శంఖమ్ము బొమ్ము బొమ్మనుచు

దానితో ఉప్పొంగి దర్పమ్ము పెరిగి
తండోపతండాలు తరలిరి జనులు
సింహగర్జనలంత చెలరేగిపోయె
స్వాతంత్ర్య కాంక్షతో శబ్దించె దిశలు
జాతివీరులతోడ జైళ్లన్ని నిండె
దేశాభిమానముల్ తెప్పలై తేలె
ఆ విజృంభణ చూచి ఆయస్సు క్రుంగి
ఆంగ్లేయపాలకు లట్టిట్టులగుచు
ఆర్డినెన్సుల కత్తులాడించినారు
ఊరకే కొందర నురితీసినారు
బరువుగా శిక్షలు వడ్డించినారు
కలవారి యాస్తులు కలుపుకొన్నారు
అన్ని చేసినగూడ అణుమాత్రమైన
జాతీయభావమ్ము సమసిపోదయ్యె.
అసహాయ శూరుండు నద్వితీయుండు
గాంధీమహాత్ముండు కళవళంపడక
జాతీయవాదుల సమకూర్చి యొకట
నాయకత్వము పూని నడిపించినాడు
శాంతమ్ముగా పోరు సాగించినాడు
ఆ అహింసావిధి కఖిల దేశములు
పులకించి చూచెరా తలయూచి మెచ్చె
జాతీయ యోధుల శౌర్యంబుకోడి
సంధియన్నారు విజాతీయ ప్రభులు
సాగెరా యంతట స్వాతంత్ర్యరథము
ఎగరెరా మనజెండ ఎఱ్ఱనికోట
కనులార యొకసారి కనుగొమ్ము నీవు
జేజేలు కొట్టరా చేయెత్తి నీవు
ఎలుగెత్తి పాడరా యీ జాతిగీతి



# నవ్వు

ఫక్కున సూర్యుడు నవ్వాడంటే
పట్టపగలు ఈ లోకముకు,
ఫక్కున చంద్రుడు నవ్వాడంటే
చల్లని వెన్నెల జగములకు,
ఫక్కున పాపడు నవ్వాడంటే
పరమానందం నీకూ నాకూ,
అవునా కాదా అలివేణీ!

పి. వాణి, బెజవాడ.



| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | 1 భా | 2 ర | 3 తీ | 4 య | డు | |
| 5 బు | | 6 వి | ర | క్తి | | 7 మ |
| 8 ధ | 9 ర | | ము | | 10 అ | ర |
| 11 వా | స | న | | 12 ఎ | లు | క |
| 13 ర | ము | | 14 షి | | 15 క | త |
| ము | | 16 బా | లి | 17 క | | ము |
| | 18 నూ | ట | ము | ప్ప | ది | |

ప జి లు జ వా బు



# ఉండాలోయ్ ఉండాలి

క. వరలక్ష్మమ్మ

పిల్లలకు పలక
తాతకు పిలక
మంచానికి నులక
ఉండాలోయ్ ఉండాలి!

రైతుకు యెద్దు
బిడ్డలకు ముద్దు
కొంటెకు గుద్దు
ఉండాలోయ్ ఉండాలి!

వేషానికి విగ్గు
బిడ్డలకు ఉగ్గు
స్త్రీలకు సిగ్గు
ఉండాలోయ్ ఉండాలి!

మేడకు మెట్లు
నీడకు చెట్లు
పొలముకు గట్లు
ఉండాలోయ్ ఉండాలి!

కాఫీకి కప్పు
కాలికి చెప్పు
కూరకు ఉప్పు
ఉండాలోయ్ ఉండాలి!



శృంగారం మేష్టారు క్లాసునంతా బెంచీ ఎక్కించినరోజునుంచీ కొందరు రౌడీ పిల్లకాయలు రోజూ ఎక్కడినుంచో నల్లుల్ని తెచ్చి మేష్టారి బల్లమీదనో కుర్చీమీదనో వేస్తూ ఉండేవారు. నేను మాత్రం వీళ్ళతో ఎన్నడూ కలవలేదు. వాళ్ళంతా రెండోక్లాసుకు పూర్వవిద్యార్థులు, పాతకాపులు.

ఓరోజు మేష్టారి మెడపట్టీమీద పోతంత నల్లి పాకుతూ కనిపించింది. దాన్ని పట్టుకుని తీసేద్దామని నేను చప్పున వెళ్ళాను. అది బాగా నెత్తురు పోసుకుని తెగబలిసి ఉంది. నేను పట్టుకోగానే ఆనల్లిపోతు బుడగవిచ్చినట్టు విచ్చింది. దాని నెత్తురు మేష్టారి తెల్లని మెడపట్టీమీద ఎర్రగా చిమ్మింది. "మేష్టారూ, మీమెడపట్టీనిండా నెత్తురండీ, సార్," అని ఒక కుర్రాడు కేక పెట్టాడు. మేష్టారు వెంటనే జేబులోనుంచి చిన్న అద్దంతీసి చూసుకున్నాడు. అప్పుడప్పుడూ అద్దంలో తన అందచందాలు చూసుకోవటం మా మేష్టారికి అలవాటు. అద్దంలో ఆయనకు నెత్తురు మరక కనిపించింది. వెంటనే బెత్తంతో మేష్టారు నావీపుమీద తాషామర్పా వాయించాడు.

"నన్నెందుకండీ కొడతారు? నేను నల్లిని తీయబోయాను గాని మీచొక్కా పాడుచెయ్యాలని నా ఉద్దేశంకాదు," అని ఘోషపెట్టా.

నోరు తెరిచినందుకు మరో రెండు దెబ్బలు కొసరు వడ్డించి మేష్టారు నన్ను క్లాసులోనుంచి బయటికి పంపించారు. నేను నేరుగా హెడ్డుమేష్టారి దగ్గిరికి వెళ్ళా. జరిగిందంతా ఆయనతో చెప్పా. అంతా విని ఆయన నన్ను క్లాసుకు



తిరిగి వెళ్ళమన్నారు. ఈ లోపుగా ప్యూనువచ్చి హెడ్డుమేష్టారు రమ్మంటున్నారని మాశృంగారం మేష్టారితో చెప్పాడు. ఆయన హెడ్డుమేష్టరు దగ్గర నించి వచ్చినతర్వాత తిరిగి నన్నాయన బయటికి వెళ్ళమనలా.

ఇది జరిగినప్పటినుంచీ నాకు క్లాసులో సున్నా మార్కులే. ఎంత కష్టపడి చదివినా, ఎంత కష్టపడి లెక్కలు చేసినా క్లాసులో సున్నాలు తప్పలేదు. మిగతా పిల్లలకి లెక్కల్లో పదికిఏడూ, ఎనిమిదీ, తొమ్మిదీ మార్కులొచ్చేవి. నాకు మటుకు సున్నాలే. లెక్కలు వాళ్ళు చేసినట్టే నేను చేసేవాణ్ణి, కాని మార్కులు మాత్రం వచ్చేవి కావు. క్వార్టర్లీ పరీక్షలోనూ, అర్ధసంవత్సరం పరీక్షలోనూ కూడా నేను తప్పాను. ఈ రెండోక్లాసు ఎట్లా పాసవుతానురా భగవంతుడా అని నాకు దిగులుగా ఉండేది.

* * *

జమీందారుగారబ్బాయి కిష్టుడికి శృంగారం మేష్టారు ప్రయివేటు చెప్పేవాడు. మూడోక్లాసులో మూడు దండయాత్రలుచేసి కిష్టుడు నాలుగోక్లాసులోకి వచ్చాడు.

వెనక కిష్టుడు నన్ను కాఫీహోటల్లో కూచోపెట్టిన సంగతి మీరు విన్నారుగా. వాణ్ణి చూసినప్పుడల్లా నా కావిషయం జ్ఞాపకంవచ్చి చాలా సిగ్గుగా ఉండేది. ఎట్లాగైనా కిష్టిగాడికి శాస్తిచేస్తేగాని నాకీ అవమానం పోదనిపించేది. గోపిగాడు బడి వదిలిపోయినతరవాత కూడా కిష్టిగాడు నన్ను చూసినప్పుడల్లా "గోపిగాడి గుర్రం!" అంటూండేవాడు.

నవరాత్రులొచ్చాయి. విజయదశమినాడు పిల్లలచేత నాటకం ఆడించటానికి కిష్టుడు ప్రయత్నాలు ప్రారంభించాడు. నాటకానికి, నాటకం అయినాక టీపార్టీకీ ఖర్చవుతుంది. అందుచేత రెండోక్లాసు, మూడోక్లాసు, నాలుగోక్లాసు పిల్లకాయలు తలకు బేడ చొప్పున చందా వేయాలన్నాడు. చందాఇవ్వనివాళ్ళకి పార్టీలేదు.

కిష్టుడు నన్నుపిలిచి, "ఒరే, విజయదశమి విందుకి కారపుశనగలూ అవీ చెయ్యాలి. నీకు చెయ్యటం చాతవునా?" అని అడిగాడు. మా అమ్మా నాన్నా బీదవాళ్లగనక నేను వంటవాడినని కిష్టుడి అభిప్రాయం కాబోలు.

నేను తడువుకోకుండా, "ఓ, నాకు ఫస్టుగా చాతవును. ఇంకా చాలా రకాల



వంటలు చేస్తా. డబ్బు నాకిచ్చెయ్యి." అన్నా. వాడు నాకు డబ్బిచ్చి, శృంగారం మేష్టారింటో వంటపాత్రలూ అవీ తీసుకోమన్నాడు.

నేను శృంగారం మేష్టారింటికివెళ్ళి కిష్టుడిచ్చినడబ్బు ఆయనతల్లి కి ఇచ్చేశా. మేష్టారితో, "మేష్టారూ, విజయదశమి వాడు మీరు ప్రెసిడెంటుగా ఉండి సహాయం చెయ్యాలని కిష్టుడు చెప్ప మన్నాడు," అని చెప్పా.

నేనే పిండివంటలు చేస్తున్నానను కున్నాడు కిష్టుడు. వాడితో నేను అన్ని ఏర్పాట్లూ జరుగుతున్నాయని చెప్పా.

నాటకం రోజున తానే ప్రెసిడెంటు అనుకుని శృంగారం మేష్టారు చిన్న జమీందారల్లే వేషంవేసుకుని వచ్చాడు. కాని, పాపం, ప్రెసిడెంటు ఆయనకాదు హెడ్డుమేష్టారు.

నాటకం అయిపోయిన తరవాత కిష్టి గాడు లేచినిలబడి, "స్నేహితులారా. ఇప్పుడొక చిన్న అల్పాహారవిందు కూడా ఉంది. దయచేసి ఎవరూ వెళ్ళి పోవొద్దు," అని కోరాడు. పిల్లలంతా విందుకోసం కూచున్నారు.

పక్కగదిలో చాలాగిన్నెలు తెచ్చి పెట్టా. అన్నిటిమీదా మూతలున్నాయి. కిష్టిగాడు ఆగదిలోకివచ్చి ఒక గిన్నె మీద మూతతీసి చూశాడు. పాపం, గిన్నెలో ఏమీలేదు. ఇంకో గిన్నె మీద మూతతీసి చూశాడు. అందులోనూ ఏమీలేదు. ఏగిన్నెలోనూ ఏమీలేదు. అన్నిగిన్నెలూ ఖాళీ.

"ఏమిటిది?" అని కిష్టిగాడు నన్నడి గాడు.

"నాకుమాత్రం ఏం తెలుసూ ? నాకు వంట చాతకాదు. అందుకని నువ్విచ్చిన



డబ్బు పట్టువెళ్ళి, ఏమన్నా పిండివంటలు చెయ్యమని శృంగారం మేష్టారి తల్లికిచ్చా. ఆవిడేంచేసిందో నువేవెళ్ళి కనుక్కో," అన్నా.

కిష్టిగాడి మొహాన కత్తివాటేస్తే నెత్తురు చుక్కలేదు. జేబులోనుంచి ఇరవై రూపాయలుతీసి, పొట్లాలు కట్టించుకురమ్మని కుర్రవాళ్ళను హోటలుకు తరిమాడు. పొట్లాలు రావటానికి అరగంటపైగా పట్టింది. ఈలోపుగా చాలామంది వెళ్ళిపోయారు. మిగిలినవాళ్ళు విందుచేశారు.

కిష్టిగాడు సిగ్గులేక నన్నుచూసి ఇకిలించాడు. వాణ్ణిచూసి నేనూ ఇకిలించా! నేనేం, తక్కువ తిన్నానా? అప్పటినుంచీ కిష్టుడు కనిపించినప్పుడల్లా వాణ్ణి చూసి ఇకిలిస్తూ వచ్చా. ఇది వాడికవమానం అయింది. వాడు నాకెన్నడూ మళ్ళీ పనిచెప్పిన పాపానపోలా.

అర్ధసంవత్సరం పరీక్షలయి పోయాయి. తరవాత డిసెంబరు శలవలుకూడా అయిపోయి. మళ్ళీ బడితెరిచారు. ఒకరోజు బడిగేటుదగ్గిర కిష్టుడు నిలబడి మరోపిల్లవాడితో, "అయింటో అమ్మాయిని చూశావా? అపిల్ల శృంగారం మేష్టార్ని చూసి నవ్వుతుంది. వాళ్ళిద్దరికీ స్నేహం," అని చెబుతున్నాడు. ఈ ముక్క నా చెవులబడింది.

ఆరోజు మధ్యాన్నమే శృంగారం మేష్టారు నన్నుపిలిచి, ఒక నీలంకవరూ, ఒక తెల్లకవరూ ఇచ్చి, "ఈనీలంకవరు బడి ఎదురుమేడలో ఉండే అమ్మాయికి రహస్యంగా ఇయ్యి. ఈ తెల్లకవరు హెడ్మాష్టరుగారికి ఇయ్యి. జాగర్త సుమా. పొరపాటు చేసేవు. తెల్లకవరు శలవ ఉత్తరం. అది హెడ్మాష్టరుగారికే ఇయ్యి. పొరపాటు చేసేవు," అని చెప్పాడు.

శృంగారం మేష్టారు నాచేతికి దొరికాడుగదా అనుకొన్నా. శృంగారంగారిచ్చిన ఉత్తరాల్లో నీలంకవరు జాగర్తగా హెడ్డుమేష్టారి కిచ్చి, తెల్లకవరు మేడలో అమ్మాయికి అందజేశా.

ఆరోజు సాయంకాలమల్లా శృంగారం మేష్టారు హెడ్డుమేష్టారిగదిలో నిలబడే ఉన్నాడు. మర్నాడు మాకింకో మేష్టరొచ్చారు.

ఏదోవిధంగా నేను రెండో క్లాసు పాసుకాగలిగా మీదయవల్ల.



# దెయ్యం అరుపు

ఏ. భానుమతి

"చందమామ గారి కొడళ్లూ,

మీకొక తమాషా చెబుతా వినండి.

నే చెప్పేది అది నా చిన్నప్పటి సంగతి. నాకప్పటికి ఆరేండ్లు వుంటాయి. రెండవ క్లాస్ చదువుతున్నా గరల్స్‌స్కూల్లో— నాతోనే మాపక్కింటి లక్ష్మికూడా చదువుతోంది. నాకంటె దానికి వయసు 2 ఏండ్లు జాస్తి వుంటుంది. అది కొంచం బడాయి చేస్తూంటుంది ఎప్పుడూ. తనకు తెలీనివన్నీ తెలుసు అని చెబుతుండేది. వాళ్ళూ మేము వొక ఇంటోనే ఉండేవాళ్లం. ఇంటో మాకు అడ్డగోడ ఉన్నా వరండాలో గోడ అడ్డంలేదు. అందువల్ల ఎక్కువసేపు మేమిద్దరము వరండాలోనే గడిపేవాళ్లం. మాతోకూడా ముసలి తాతవొకడు.

లక్ష్మికీ నాకూ ప్రాణస్నేహం. వొకేసారి బడికెళ్లడం వొకేసారి భోంచేయడం. బయట వరండాలో కూర్చుని కథలు చెప్పమని తాత ప్రాణాలు తీసేవాళ్ళం. తాత హుషారుగావుంటే రోజుకు 2, 3 కథలు చెప్పేవాడు. లేదంటే వొక్క కథ. అసలు చెబితేచాలు అనుకునేవాళ్లం మేమిద్దరం. వొకసారి ఖర్మంచాలక దయ్యాల కథ చెప్పాడు తాత. ఆకథలో వొక దయ్యం రాత్రిపూట వచ్చి వొక పిల్లను ఎత్తుకుపోయింది. తెల్లవారేసరికి అపిల్ల చెరువుగట్టున కూర్చొని ఏడుస్తోంది. తర్వాత వాళ్ళవాళ్లు వచ్చి ఆ అమ్మాయిని యింటికి తీసికెళ్లారు. కాని మర్నాడు ఆ పిల్లను మళ్ళీ దయ్యం ఎత్తుకెళ్ళి చెరువుగట్టున వదిలిందట. ఇట్లా ఎన్నిసార్లో చేసిందట.

ఆకథ మేమిద్దరం విన్నాం. లక్ష్మి నాకంటె రెండేళ్లు పెద్దదైనందువల్లో, మరి దానికి నాకంటె ధైర్యం జాస్తి అవడం వల్లనో, తెలీదుకాని అది భయపడలా. నేను మాత్రం ఆకథ విన్నది మొదలు నా నీడచూచుకొని దయ్యమే



అనుకుని భయపడేదాన్ని. ఎక్కడికి వెళ్ళినా వెంట దయ్యంవస్తున్నట్లు అనుకునేదాన్ని. వొంటరిగా ఎక్కడికీవెళ్ళేదాన్ని కాదు.

వొకరోజు రాత్రి 8 గం. కూడా కాలేదు. దాహం ఐతే లోపలికెళ్లాను. వొకమూల చాపలు అన్నీ కట్టగా వేసివున్నాయి. ఆ చోటంతా చీకటిగా, ఆచాపచుట్ట నల్లగా కనిపించింది. నేను అది దయ్యమే అనుకుని మరి నీళ్లు తాక్కుండా వొక్క పరుగునవచ్చి లక్ష్మితో చెప్పాను. అది నవ్వుతూ, "ఐతే నీకు దయ్యం అంటే భయమా" అని అడిగింది.

అవునన్నా. అదిమొదలు లక్ష్మి చాలా దయ్యాలకథలు చెప్పేది.

నాకు దయ్యమంటే రోజు రోజు కూ భయం ఎక్కువైంది. లక్ష్మికి వొకళ్లు భయపడుతున్నా ఏడుస్తున్నా చూట్టం సరదా. ఏదో సామెతచెబుతారే "పిల్లికి చెల్గాటం ఎలుకకు ప్రాణసంకట" మని, అల్లాగే. ఈ దయ్యాలవిషయం విన్నప్పట్నుంచీ నేను వొంటరిగా పడుకోలేక లక్ష్మి పక్కలో ముడుచుకొని పడుకునే దాన్ని.

లక్ష్మికి నేను భయపడుతున్నానని తెలిసి ఇంకా ఏడిపించేది. అదుగో దయ్యం. ఇదుగో దయ్యం అని. పైగా బడాయిలు కొడుతుండేదికూడా. వొకసారి లక్ష్మి కి దయ్యం కనుపించిందిట- మాట్లాడిందిట కూడా. దయ్యం లక్ష్మినిచూచి భయపడి పారిపోయిందిట. "మళ్ళీ యీ చాయల కొస్తే కాళ్లు విరగ్గొడతా" ననికూడా చెప్పిందట లక్ష్మి. అప్పుడు అది చెప్పేవన్నీ కూడా నిజమే గాబోలు అనుకునేదాన్ని. పైగా మేం చదువుకునే స్కూల్లోకూడా దయ్యాలున్నాయని చెప్పింది. కాని పగలు రావట. రాత్రుళ్ళు కనిపించుతాయి అని చెప్పింది. నయమే, లేకపోతే బడికి "గుడ్ బై" చెప్పి మానుకునేదాన్నే. అసలు లక్ష్మినిచూస్తే దయ్యానికి భయం కదా లక్ష్మిదగ్గరవుంటే దయ్యాలు రావు అనుకుని నేనెప్పుడూ లక్ష్మి వెంటనే దాని నీడలాగు తిరుగుతుండేదాన్ని. యీ అలుసు తీసుకుని అది నాచేత అరకుచాకిరీ చేయించుకునేది. వాళ్ళింట్లో దాని వంతు పని నా నెత్తినపెట్టి చెయ్యమని తను మహారాణిలాగా చదువుకుంటూ కూర్చునేది. యీ సంగతి మావాళ్ళకుతెలుస్తే తంతారు. కాని లక్ష్మితో దెబ్బలాడితే దయ్యాలని వొదిలేస్తే. అంచేత యీసంగతులు ఎవరికి చెప్పకుండా లక్ష్మితో స్నేహంగానే వుంటుండే దాన్ని.





వొకసారి లక్ష్మి అడిగింది - "నీకు దయ్యము అరుపు వినాలనివుందా" అని. ఆమాట వినేసరికే నాకు గుండె ఆగిపోయినంత పని జరిగింది. "నాకు భయ" మన్నాను. "ఛా-ఛా, అది దూరాన్నుంచి అరుస్తుం" దన్నది. నాకు మనసులో వొక పక్క వినాలనివుంది. కాని ధైర్యం చాలక "నే నొకవేళ భయపడతానేమో. ఎప్పు డరుస్తుం"దని అడిగా.

"రాత్రి సరిగ్గా 2 గం. ఆ ప్రాంతాలలో అరుస్తుంది. కొంచం భయంగానే వుంటుంది దాని అరుపు. మన ఇంటివెనకాల వున్న మైదానంలోనే అరుస్తుంటుంది రోజూ" అని చెప్పింది. ఆ మాట విని నేనింకా హడలిపోయాను. "నీకేం భయం లేదు నేనున్నానుగా" అంది లక్ష్మి.

"రాత్రి 2 గంటలకెల్లా మెళుకువ వస్తుంది" అన్నా. "నేను లేపుతాలే" అంది లక్ష్మి. ఆ రాత్రికి అన్నంకూడా సహించలేదు. భయం జాస్తిగావుంది. అమ్మతో చెబుదామా అనుకున్నా కాని లక్ష్మికి వొట్టువేశాను అది చెప్పినమాట ఎవరితో చెప్పనని. ఎల్లాగా ఆ రాత్రికి సరిగా నిద్ర పట్టలా. లక్ష్మిని కావిలించుకుని పడుకున్నా. అది నేను భయపట్టంచూచి "యిప్పుడే ఎందుకంత భయం. అది



అరిచేది రాత్రి 2 గంటలకు. నీవు నిద్రపో, నేను లేపుతాను" అంది. నేను నిద్ర పొయ్యాను.

రాత్రి సరిగ్గా 2 గంటలకు లక్ష్మి నన్ను తట్టిలేపింది. నేను చెవులు నిక్కరించి విన్నా. అబ్బ! గుండె లదిరిపొయ్యాయి. అంత నిశ్శబ్దంగావుండే సమయంలో ఆ అరుపు చాలా భయంకరంగావుంది. లక్ష్మి నిజంగా చాలా ధైర్యస్థురాలు. లేకపోతే అది భయంలేకుండా ఎలా కూర్చుంది? నేను గజగజ వణికిపోతూ కూర్చున్నా. దయ్యమరవడం ఆపింది. దాని నోరు ఎంత పెద్దదో యింత గట్టిగా అరవడానికి! దాని అకారం ఎంత వుంటుందో, అదేం బట్టలు వేసుకుంటుందో? యివన్నీ ఆలోచిస్తూ గుడ్లప్పచెప్పి లక్ష్మివంక చూచాను. అది నవ్వుతూ "సరే, యింక పడుకో" మంది. నేను దాన్ని గట్టిగా కావలించుకుని పడుకున్నా.

తెల్లవారిన తర్వాత రాత్రి జరిగింది నాకొక కలలా అనిపించింది. లక్ష్మి నడిగితే "నిజమే. రాత్రి దయ్యం అరిచినప్పుడు నిన్నులేపాను. నువ్వు భయపడ్డావుకూడా" అని చెప్పింది. దయ్యం అల్లా అర్ధరాత్రప్పుడు ఎందుకరుస్తుందో కనుక్కోవాలని నా మనసారాటపడింది. అది చెప్పేవాడు మా తాత వొక్కడే. లక్ష్మి సరిగాచెప్పదు. లక్ష్మికి తెలియకుండా మా తాతనడిగా.

తాత విరగబడి నవ్వుతూ "పిచ్చితల్లీ! నిన్ను భయపెట్టాలని చెప్పవుంటుంది లక్ష్మి. రాత్రి నువ్వు విన్నది రైలుకూత తల్లీ. రాత్రి 2 గంటలకు కలకత్తానుంచి మెయిల్ పోతూవుంటుంది. దాని కూత అది. మొదట్లో లక్ష్మి నీలాగే భయపడింది. దానికెవరో పిల్ల చెప్పిందట దయ్యా మరుస్తుందా సమయంలో అని. వొకరోజు రాత్రి సరిగా అదేసమయానికి రైలు కూత వేసింది. లక్ష్మి దాని మంచంవదిలి పరుపరుగెత్తుకొచ్చి నామెడ కావలించుకుంది. నేను నిద్దట్లో వులిక్కిపడి "ఏమిటే" అంటె దయ్యం అరుస్తోందన్నది. నేను విందును గదా రైలుకూత తప్ప ఏమీలేదు. నేను దానికి రైలుకూత అని చెప్పి భయం పోగొట్టాను. మళ్ళీ నీకు చెప్పిందా అది!"

ఓస్ యింతేనా! లక్ష్మికి నాకంటె భయమున్నమాట? లక్ష్మి చెప్పినవన్నీ తాతతో చెప్పాను. అవన్నీ పచ్చి అబద్ధాలు, నమ్మి భయపడవద్దని చెప్పాడు. అది మొదలు లక్ష్మి ఏదిచెప్పినా మూడు వంతులు తీసివేసి నాలుగోవంతు నమ్మేదాన్ని. లక్ష్మి ఎంత బడాయికోరో తేలిపోయింది. కాని నాకు దయ్యాలంటె ఇంకాభయమే.






మనం కాకులకు చాలా అన్యాయం చేస్తాం. ఒక్క ఉదాహరణ చూడండి. భరించరాని శబ్దం ఏదైనా అవుతూవుంటే కాకిగోల అంటాం. కాని నిజం ఆలోచిస్తే కాకులంత బుద్ధిమంతులు లేవు. ఏదైనా పనిమీదఉన్నప్పుడు కాకి ఎన్నడూ చప్పుడు చెయ్యదు. తనజాతికి ఏదైనా అపాయం కలిగితేనూ, ఏదైనా ఆహారం దొరికినప్పుడూ కాకి సాటివారిని ఎలుగెత్తి పిలుస్తుంది. కాకికి బంధుప్రీతీ, జాత్యభిమానమూ ఉండబట్టి అట్లా తనవారిని పిలుస్తుంది. కాకికున్న జాత్యభిమానంలో ఎన్నోవంతు కూడా లేని మనం కాకిగోల అనటం చాలా అన్యాయం.

మొన్న ఉప్పుశెట్టిగారింటో పెద్దెత్తుగా పెళ్ళి జరిగింది. ఉప్పుశెట్టిగారి రెండో అమ్మాయిని పప్పుశెట్టిగారి మూడో అబ్బాయి కిచ్చి పెళ్లిచేశారు. ఎన్నోమైళ్ళ దూరం నించి వందలాది బంధువులు పెళ్లికి వచ్చారు. వారికందరికీ శుభలేఖలూ పిలుపులూ వెళ్ళాయి.

పిలుపులూ శుభలేఖలూ వెళ్ళకపోయినా ఊరు నాలుగు మూలలనుంచీ కుక్కలూ, పందులూ కూడా పెళ్లివారింటిదగ్గిర చేరాయి. కాకులమాట వేరే చెప్పాలా? మన కాకమ్మక్కా, కాకిబావా వేళకు చేరుకున్నారు.

మనుష్యులకు ఏది ముఖ్యమో ఏది అముఖ్యమోకూడా తెలియదు. పెళ్లివారింటో ఎంతసేపూ మంత్రాలూ, బాజా భజంత్రీలూ, పెళ్లికొడుకు పెళ్లికూతురు మెళ్లో మంగళసూత్రం కట్టటమూనూ, అంతేగాని రెండుఝాముల పొద్దెక్కినా తిండి ప్రమేయమేలేదు. పెళ్లి పందిట్లో ఉన్న అతిథుల మాటేమోగాని, వీధిలో చేరిన పందులకూ, కుక్కలకూ పెళ్లివారి జాగుచూస్తే వొళ్లు మండిపోయింది.



కాకమ్మక్క, కాకిబావా మటుకు లొట్టలేస్తూ కూచోక అట్లా, అట్లా పాకశాల దగ్గిరికిచేరి వంట బ్రాహ్మలను ఏమరిపించి వంటకాలు ముందుగానే రుచిచూచి వచ్చారు. ఇంకా ఎవరూ తినకమునుపే కాకమ్మక్కకు వంట నివేదన అయిపోయింది.

కొంతసేపటికి భోజనాలు ఆరంభమయాయి. తిండి వాసనకొట్టటమే ఆలస్యంగా కుక్కలు ఒకదాన్నిచూచి ఒకటి అరవసాగాయి.

"ఈ కుక్కలను భగవంతుడెట్లా సృష్టించాడు. ఒకదాన్ని ఒకటి పిలుచుకోవటంలేదు. ఒకదానికొకటి సహాయపడి తిండి అందించుకోవటంలేదు. ఈ బుద్ధిమాలిన జంతువులు అప్పుడే తమలోతాము పోట్లాడుకోసాగాయి," అన్నది కాకిబావతో కాకమ్మక్క.

"వాటి కా జ్ఞానంలేకపోవటం మనకే మేలు," అన్నాడు కాకిబావ.

దూరానఉన్న మురికి గుంటలోనుంచి పంది మామయ్య కుక్కలను ఒక కంటితో చూస్తూన్నాడు.

ఇంతలో గోడమీదినుంచి పుల్లాకులు కట్టలు కట్టలుగా పడసాగాయి. పంది మామయ్య సమీపంలోనే అవి పడ్డాయి.

పంది మామయ్య తాపీగా లేచి నిలబడి తీవిగా వొళ్లంతా ఒక్కసారి విదిలించి, చేతికర్ర ఆడించినట్టు తోక ఆడిస్తూ ఆకుల మధ్య ముట్టెపెట్టి భోజనం ఆరంభించాడు.

ఇంతలో ఒక కుక్క గబగబా పరిగెత్తుకుంటూ పందిమామయ్య దగ్గిరికి వచ్చింది. మరో మూలనుంచి ఇంకో కుక్కవచ్చి మొదటిదాన్ని నిలవేసి, 'బొంయి, బొంయి' మని అరిచింది. రెండుకుక్కలకూ ఈ కిందివిధంగా వాగ్వాదం జరిగింది.

"కళ్ళు నెత్తిమీది కొచ్చాయే! ఇక్కడున్నది ఎవరనుకున్నావ్?"

"నువుకూడా ఒక కుక్కల్లే మాట్లాడ వచ్చావే! అబ్బో!"

"ఈ కబుర్లు కట్టిపెట్టు, నీ కింకా నా తడాఖా తెలీదు."

"అన్నీ తెలుసు. నీపంటివాళ్లని లక్ష మందిని చూశాను."

"డొక్క చించి డోలు కట్టించగలను, ఏమనుకున్నావో?"

"ఒక్కటిచ్చుకున్నానంటే నీ బాబు గాడితో చెప్పుకోవాలి."

"బొంయ్! బొంయ్!"

"బొవ్! బొవ్!"

"మనిద్దరం పోట్లాడుకుంటే పంది మామయ్యా కాస్తా విస్తళ్ళు నాకేస్తున్నాడు."

"చచ్చు వెధవ్వ. నిన్ను తిననిచ్చేకంటే పందిమామయ్యా తిన్నా నాకు సంతోషమే."

"నేనూ అదే అంటున్నాను."

ఈవిధంగా కుక్కలు కొట్లాడుకుంటుంటే కాకమ్మక్క పందిమామయ్యా వీపు మీద వాలి, తనకు పనికొచ్చే పదార్థం కనిపించినప్పుడల్లా కిందికిదిగి తింటూ హాయిగా కడుపునింపుకున్నది.

ఈలోపుగా కుక్కలు రాజీపడి పంది మామయ్యా మీదికి దండెత్తి వచ్చాయి. పందిమామయ్యా చీటికీ మాటికీ కొట్లాటలకు దిగేరకంకాదు. కుక్కల్ని ఒక కంట అసహ్యంతో చూసి పక్కకి తప్పుకున్నాడు.

కుక్కలు చాలా అనుమానంగలవి. కాకమ్మక్కా, కాకిబావా సమీపంలోనే



ఉండటంచూసి వాటి అనుమానం మరింత అయింది. అందుచేత అవి మధ్య మధ్య కాకులకేసి చూస్తూండేవి. ఇది కనిపెట్టి కాకమ్మక్కా, కాకిబావా కుక్కలకు చెరో వైపూచేరి కుక్కలు ఒకదానివంక చూసి నప్పుడు మరొకటి తిండి కాజేస్తూ పేచీ లేకుండా కడుపునింపుకున్నారు.

ఇంత అడావుడి చేసినా కుక్కల కడుపు నిండలేదు. ఎంత తిన్నా పందిమామయ్యా కడుపు నిండేదీలేదు. కాని కాకమ్మక్కకూ కాకిబావకూ చక్కగా కడుపునిండింది. అయినా వాటిభోజనం ఇంకా పూర్తికాలేదు.

"ఏమే, వొసీ! లోపల అంట్ల గిన్నెలు మనకోసం ఎదురుచూస్తూన్నాయి. మనవాళ్ళందర్నీ పిలుచుకుని అక్కడికిపోదాం పద!" అన్నాడు కాకిబావ.

మొగుడికి సమాధానంగా కాకమ్మక్క "కా, కా!" అన్నది. ఇద్దరూకలిసి ఉప్పుశెట్టిగారి దొడ్డివేపు ఎగిరిపోయారు.




## కొ క్కె రా యి





గుండ్రాతి మడుగూలో గోండ్రూగప్పలు రెండు
ఎగిరెగిరీ కోలాట మేసేగదా,
గ్రుడ్డీ కొక్కెరాయి ఒడ్డూన గూర్చుండి
గడ్డీకి సుద్దూలు చెప్పేగదా,
చేపాజెల్లాలన్ని తేపాతేపకువచ్చి
ఎండ్రాకాయతో గంతూ లేసేగదా,
కొక్కెరానాయాలు కుటిలాముంచూకోని
చేపల్తో స్నేహాము చేసేగదా!
ఒక్కొక్క చేపాయ నూరాచెర్వుకుదీసి
చట్రాతి పైనేసి చంపేగదా!
ఎండ్రాకిచ్చనుగూడ నీపనేచేస్తూంటే
కొక్కెరా గొంతాది నొక్కెగదా!

---

ఏటుకూరి రవీంద్రం

---





గ్రుడ్డికొక్క్రెరాయి కొల్లేటి కొరగింది
గనుము కాకరగాయ గబగబా బరిగింది
కొసంతలోపల్నే కధకంచి కేగింది
ప్రొద్దట్టె క్రుంకింది ముద్దిట్టె మ్రింగాము.



బురుపిట్ట తుఱ్ఱంది
బుజ్జాయి గఱ్ఱంది
మాగేటు కిఱ్ఱంది
మాయిల్లు గుఱ్ఱంది.







కొంగా కోతీ పందెం వేసుకున్నవి. కోతిచేసిన సర్కసుపనులన్నీ కొంగచేస్తానన్నది. కోతి ముందు తోకతో గిరగిర తిరిగింది.





కొంగా ముక్కుతో గిరగిర తిరిగింది.





"అట్లా కాదు, ఇట్లా" అన్నది కోతి, తోక రెండుమూడు చుట్లుతిప్పి.



కొంగకూడా అట్లా మెడ మెలికలుతిప్పి కీచుమని చచ్చింది.

## బొమ్మల పెండ్లి పిలుపు

శ్రీ గండికోట రామచంద్రరావు
సికింద్రాబాదు



కళకళలాడే జాబిల్లిమామ!
కోయని కూసే కొదమరేయిలా!
జుమ్మని యెగిరే తుమ్మెదవదినా!
బొమ్మల పెండ్లికి రారండమ్మా!

చిగురుటాకులు చెట్లుచేమలూ
పూతపూసిన పూలతీగెలు!
పళ్లతోనిండిన ఫలవృక్షమ్ములు
పేరంటానికి రారండమ్మా!

కిలకిల నవ్వే చిలుకల గుంపులు
అంబా! అనెసూ లేగదూడలూ
ఆటలాడుతూ పాటలుపాడుతు
త్వరగారండీ బొమ్మల పెండ్లికి!

తీయ తేనెలా అరగింపులూ;
వాడని చిగురులు వాయనమ్ములూ
హారతి వెలుగులు అరుణకిరణములు
రారండమ్మా బొమ్మల పెండ్లికి!

కైకొనుడమ్మా పెండ్లి కానుకలు
పట్టండమ్మా పరిమళగంధం!
ఆనందం మనకానందం!
బొమ్మలపెండ్లే మనకానందం!

## చిట్టికి పెళ్ళికావాలిట!

కిరణ్



నాన్నా! నాన్నా!
బాకాలవిగో!
నాన్నా! నాన్నా!
బాజాలవిగో!

సాహెబ్ వూదే
బాకాచూడూ
ధణధణమోగే
డప్పులు చూడూ!

అవిగో! అవిగో!
అవి గవిగో!
తురతుర ఎగిరే
తారాజువ్వలు
చురచురవెలిగే
చిచ్చుబుడ్లూ
పువ్వులురాలే
పువ్వుల వత్తులు
బాగావుందీ
బాణాసంచా!

అక్కయ పెళ్లీ
చక్కగవుందీ!
అయితేనాన్నా!
మరి నాపెళ్ళో!!



# తండ్రి కొడుకులు



ఒకనాడు లక్ష్మి అమ్మవారు తన భర్త అయిన శ్రీ సత్యనారాయణస్వామి వారితో అన్నదిగదా: "ఏమండీ, ఇన్నిలక్షలమంది మిమ్మల్ని నిత్యమూ ఇన్నికోరికలు కోరుకుంటారు గదా, మీరు, పాపం, వాళ్ళ కోరికలన్నీ తీర్చరేం?"

ఈమాటకు స్వామివారు చిరునవ్వు నవ్వి, "పిచ్చిదానా, ఆకోరికలన్నీ తీర్చటం వల్ల వాళ్లకి నిజంగా సుఖం ఉండదు. ఆ సంగతి తెలియక వారు రకరకాల కోరికలు కోరుకుంటారు. వారిక్షేమం కోరినవాణ్ణి కనక వాటిని నేను తీర్చటంలేదు" అన్నారు.

అమ్మవారికి ఈ సమాధానం తృప్తి కలిగించలేదు.

"అయినా మీరు ఒకరికోరిక తీర్చి చూడండి. ఏం జరుగుతుందో చూతాం," అన్నది అమ్మవారు.

"ఒకఊళ్లో సూరయ్య అనే పెద్దమనిషి ఉన్నాడు. అయనకు పిల్లలులేక భార్యతో సహా నన్ను పిల్లలకోసం ప్రార్థించాడు. జరగబొయ్యేది తెలిసికూడా నేనా సూరయ్యకు ఒక కొడుకునిచ్చాను. వాడికి సత్యనారాయణ అని పేరుపెట్టుకున్నారు. వాడు పుట్టిన కొద్దికాలానికే తల్లిపోయింది. సూరయ్యకు కొడుకును పెంచటం చాతకాలేదు. వాడు పొట్టి గడుగ్గాయుగా తయారయినాడు. తండ్రికీ కొడుకుకూ మధ్య పెద్ద అగాధం ఏర్పడ్డది. కొడుకుతన కడుపున చెడపుట్టాడనుకుంటాడు తండ్రి. తండ్రితనకు గర్భశత్రువనుకుంటాడు కొడుకు. వాళ్లిద్దరికీ సుఖంలేదు," అన్నారు స్వామివారు.

"పాపం. వాళ్లకు మరోవరం ఏదైనా ఇచ్చి వాళ్లను ఒకచోట్కు చేర్చండి." అన్నది అమ్మవారు.

అమ్మవారిమాట తీసివెయ్యలేక స్వామివారు 'సరే'నని ఒప్పుకున్నారు.

* * *

ఆరోజు సత్యనారాయణ బడి ఎగగొట్టి మధ్యాన్నం వేళకే ఇంటికి వచ్చాడు.

"అప్పుడే వచ్చావేమిరా?" అన్నాడు తండ్రి.

"నాకు కడుపులో నొప్పిగాఉంది," అన్నాడు కొడుకు.

"వంటలక్క గారెలూ, అవడలూ చేసింది. అవి తినే గీతలేదు నీకు. పోయి గదిలో పడుకో," అని సూరయ్య సత్యాన్ని గదిలోకినెట్టి బయట గొళ్లెం పెట్టాడు.

గదిలోపల సత్యమూ, గదిఇవతల సూరయ్యాకూడా ఆలోచనల్లో పడ్డారు.



"చిన్నతనం ఎంత సుఖమయమైనది. బడికి వెళ్లటమూ, పాఠాలు చదుకోవటమూ, హాయిగా ఇంత తిని తిరగటమూ ఎంత ఆనందంగా ఉంటుంది. ఇల్లూ, వాకిలీ, డబ్బూ, దసకమూ అంటూ విచారంలేదు. అజీర్తి బాధలేదు. నా కొడుకు పొట్టిరాలుగాయి అయినాడు గాని నేనే వాడి యీడువాడినైతేనా? ఎంత చక్కగా బడికి పోదును!" అనుకున్నాడు సూరయ్యా.

గదిలో సత్యంకూడా తన ధోరణిలో తాను ఈ విధంగా అనుకోసాగాడు:

"వెధపబడి, వెధవ చదువు, వెధవపాఠాలు! ప్రతిదానికీ పెద్ద వాళ్ల నిర్బంధమే. వాళ్లని కోప్పడే వాళ్ళులేరు. వాళ్లు కావాలసినన్ని గారెలూ అపడలూ తినవచ్చు. బళ్లోకి పోనక్కర్లేదు. ఎక్కడికి పడితే అక్కడికి పోవచ్చు. నేనే మానాన్నల్లే పెద్దవాడినైతేనా—?"

"పాపం, వాళ్ళిద్దరి కోరిక తీర్చండి," అన్నది అమ్మవారు. స్వామివారు అమ్మవారి కోరిక చెల్లించారు.

* * *

గది బయటఉన్న సూరయ్యాకు సత్యం రూపం వచ్చేసింది. గది లోఉన్న సత్యానికి తండ్రిస్వరూపం వచ్చేసింది. కాని ఈమార్పు జరిగి నట్టు ఇద్దరికీ తెలియదు.

తండ్రి అయిన సూరయ్యా వీధి లోకి వెళ్లాడు. ఇళ్లన్నీ చాలా ఎత్తుగా అయిపోయినట్టు తోచింది. తలఎత్తితేగాని రెండు అంతస్తులు కూడా కనిపించలేదు. కాని దీన్ని గురించి సూరయ్యా ఆటే వితర్కించలేదు.



వీధిలో తన పాతస్నేహితుడు గోపాలం కనిపించాడు సూరయ్యకు. "ఏంరా, గోపాలం?" అని పలకరించాడు సూరయ్య.

గోపాలం చాలా విచిత్రంగా ప్రవర్తించాడు. మామూలుగా సమాధానం చెప్పటానికి బదులుగా కళ్లెర్రచేసి," ఓరి, పిడుగా, అంత పొగరెక్కిందిగా. ఉండు మీనాన్నతోచెప్పి తాటవొలిపిస్తా!" అంటూ కర్రఎత్తి భయంకరంగా మీదికి వచ్చాడు గోపాలం.

సూరయ్యకు భయంవేసి పరిగెత్తాడు. అంతవేగంగా పరిగెత్తగలిగినందుకు తనకే ఆశ్చర్యంవేసింది. చిన్నతనంలో ఎప్పుడు పరిగెత్తాడో ఏమోగాని ఇటీవల సూరయ్య గబగబా నడిచిన పాపానకూడా పోలేదు. ఎందుచేతనంటే శరీరం అంతో ఇంతో లావెక్కింది. ఉదరంకూడా తన్నుకొచ్చింది. తనకన్న సన్నగాఉండే గోపాలం తనతో పరిగెత్తలేక పోవటంచూసి ఆశ్చర్యపడ్డాడు సూరయ్య.

ఆయన పరిగెత్తటం మానేసి ఆగి," "ఎందుకు నేనిట్లా పరిగెత్తుతున్నాను. గోపాలం నన్నుకొట్టటమేమిటి? నేను పారిపోవటమేమిటి?" అనుకుంటూ ఆయన విరగబడి నవ్వసాగాడు.

ఇంతలో ఎవరో భుజంమీద గట్టిగా చరిచి, "ఒరే, ఇందుకేనా నువు బడి ఎగగొట్టింది?" అని అడిగాడు. సూరయ్య ఉలిక్కిపడిచూస్తే ఏడెనిమిదేళ్ల కుర్రకుంక తన మొహంలోకిచూసి కొంటెగా నవ్వుతున్నాడు.

వాడిమొహం చూడగానే సూరయ్యకు మండిపోయింది.

"మీద చెయ్యితీస్తావా? ముక్కలు విరగదన్నమంటావా? ఎవడురా నువ్వు?" అన్నాడు సూరయ్య.

"నీకెంత పొగరెక్కిందిరా? ఇవాళ బడి ఎగేసినందుకు రేపు మేష్టారు నిన్నేంచేస్తాడో చూడు," అంటూ ఆ కుర్రవాడు మూతి ముడుచుకుని వెళ్లిపోయినాడు. ముక్కుపచ్చలారని కుర్రవెధవ తనతో అట్లా మాట్లాడినందుకు సూరయ్యకు ఆశ్చర్యంతో నోటమాటరాలా.

సూరయ్య నడివీధిలో నిలబడి ఆశ్చర్యపడటానికి వేళలేదు. ఇంటికి కావలిసిన సరుకులు వెచ్చాల అంగడిలోకొని పంపాలి. షావుకారు సుబ్బయ్య దుకాణానికివెళ్లి సూరయ్య "ఏం, సుబ్బయ్యా. ఒక అర బస్తా బియ్యమూ, పది శేర్లు కందిపప్పూ, రెండు ఎత్తులు చింతపండూ కావాలి," అన్నాడు.

"దానికేం బాగ్గెంతే గాని డబ్బులేయా?" అని అన్నాడు సుబ్బయ్య.






సూరయ్యకు చాలా కోపం వచ్చింది. తనతో సుబ్బయ్య అట్లా మాట్లాడతాడా? అంత కోపంలోకూడా సూరయ్య జేబు తడువు కుంటే డబ్బుల సంచీ లేదు. జేబులో విరిగిన సీమసున్నం ముక్కా, ట్వైను దారమూ, ముక్కులేని చిన్న పెనసలూ, ఒక నెమలిఈకా, గుడ్డల తానుమీద చించుకొన్న బొమ్మలూ దొరికాయి.

ఈసారి సూరయ్య అశ్చర్యానికి మేర లేదు. ఏదో మోసం జరిగినట్టు స్పష్ట మయింది. ఎన్నడూలేనిది విపరీతమైన ఆకలికూడా వేస్తున్నది. హోటలుకు పోయి తిందామంటేకూడా దగ్గిర కానీ లేదు. హోటలుదగ్గిర నిలబడి లోపల ఉప్మాలూ, కారపుబూందీ, రవ్వట్లూ తినే వాళ్ళనిచూశాడు.

ఇంతలో ఆయన దృష్టి హోటలు వాకిలికిపెట్టిన అద్దం తలుపు మీద పడింది. అందులో తన ప్రతిబింబం కనిపించింది. కాని అది తన బొమ్మకాదు. తన కొడుకుది.

మొదట తన కళ్లను తానే నమ్మలేక పోయినాడు. వొంగి కాళ్ళకేసి చూసు కున్నాడు. కాళ్ళు చిన్నవిగా ఉన్నాయి. చెప్పులులేవు. ధోవతికి బదులు లాగు కనిపించింది. నెత్తి తడువుకున్నాడు. నున్నని బట్టతల ఉండవలసినచోట మెత్తని జుట్టున్నది. మొహం తడువు కున్నాడు. మీసాలులేవు. గడ్డం నున్నగా ఉంది. కళ్ళకు జోడులేదు. కాని దృష్టి చక్కగానే అనుతున్నది.

ఇప్పటికి సూరయ్యకు తనలో జరిగిన మార్పు అర్థమయింది. తను తన కొడుకుగా మారితే, తనకొడుకే మయినట్టు? ఈ ప్రశ్న కలగగానే అయనకు పట్టరాని భయంవేసింది.

[ఈ కథ ఇంకావుంది]




ఇంత మోసంచేసిన నక్కబావని ఎట్లాగయినా శిక్షించాలని మంగలాయూ, పెళ్లామూ గట్టిగా అనుకున్నారు. ఉచ్చులూ, వలలూ, బోనులూ పట్టుకుని వాళ్లిద్దరూ పొద్దునే బయలుదేరి అడివికి వెళ్లారు. మధ్యాన్నంవేళకు వెంటతెచ్చుకున్న మినపరొట్టెలుతిని ఇన్ని నీళ్లు తాగారు. నక్కబావ ఆచోకీ తీయటానికి అడివంతటా వెతక సాగారు.

ఒకచోట వాళ్లకి అడుగుల జాడలు కనిపించాయి. వాటిని పట్టుకుని పోగా పోగా ఎంతోసేపటికి ఒక తోడేలుపిల్ల కనిపించింది. "ఛీ, మన శ్రమంతా వృధా అయిందిగదా," అనుకున్నారు మంగలి దంపతులు. అడివి అంతటా నక్క బావ జాడలే ఉన్నట్టు కనపడింది వారికి. వాటిని పట్టుకుని వెనకకూ ముందుకూ తిరిగి తిరిగి వేసారి ఎండవేడికి పొదల నీడన కాస్సేపు విశ్రమించదలిచారు.

మంగలి కాస్త నడుము వాల్చాడో లేదో మంగలి పెళ్లాం కెవ్వున కేకపెట్టి, "అదుగో నక్క!" అన్నది. అంత దూరాన రెండు పొదల మధ్యగా ఏదో పరిగెత్తినట్టు మంగలికికూడా తోచింది. దేవుడా అంటూ మంగలి లేచి ఆవేపు పరిగెత్తాడు. కాని తీరా వెళ్ళిచూస్తే అది కుందేలు. ఆ భార్యాభర్తలిద్దరూ ఒక్కక్షణంకూడా విశ్రాంతి తీసుకోలేక పోయినారు. ఎందుచేతనంటే అనుమానం పెద్దరోగం గనక వారికి ప్రతి పొదలోనూ నక్కబావ నక్కి ఉన్నట్టే కనిపించింది. ఒకచోట జిల్లితోక కనిపించేది. మరొకచోట సల్లనిమూతి కనిపించేది. కాళ్ళీడ్చుకుంటూ పోయి చూస్తే ఏమీ ఉండేదికాదు.

ఈవిధంగా పగలల్లా కాళ్లపడేటట్టు అడివి అంతటా తిరిగి పొద్దుకూకే వేళకు అడివి అంతటా ఉచ్చులూ, వలలూ పన్నసాగారు. వలలు చుట్టూ





తిరిగివచ్చాయి.కాని చిన్న ఖాళీ ఉండిపోయింది. ఆ ఖాళీకూడా మూయకపోతే మధ్య ఉన్న నక్కబావ సందునుంచి తప్పించుకుపోవచ్చు. అందుచేత ఆసందులోచెట్లకొమ్మలుపాతి ఆఖాళీ మూద్దామనుకున్నారు. మంగలి చెట్లకొమ్మలు కొట్టుకొచ్చాడు. వాటిని దట్టంగాపాతారు.

పెళ్లాన్ని అక్కడే కాపుపెట్టి మంగలి వలలుపన్నిన మేరయావత్తూ తిరిగివచ్చాడు. ఎక్కడా నక్కబావ చిక్కినజాడ కనిపించ లేదు. చీకటికూడా పడిపోయింది.

అకస్మాత్తుగా మంగలి పెళ్లానికి కొమ్మల వెనక ఏదో కదిలినట్టయి కొమ్మల సందుగా చెయ్యిచాచింది. ఆ సమయానికే అవతలివేపు చేరిన మంగలికికూడా కొమ్మల మధ్యగా నక్కబావ దూరిరావటానికి ప్రయత్నిస్తున్నట్టు తోచింది. వాడుకూడా చెయ్యిచాచి తనవేపువచ్చే భార్యచేతిని పట్టుకున్నాడు. "నా చేతికేదో చిక్కింది," అని కేకపెట్టాడు మంగలి.

"నాచెయ్యి దేనికో చిక్కింది," అని కేక పెట్టింది పెళ్లాం.

"గట్టిగా పట్టుకో. పోనీమాకు!" అన్నాడు మంగలి.

"తాడుపెట్టి కట్టెయ్యి తప్పించుకుపోయ్యేను!" అన్నది పెళ్లాం.

ఇద్దరూ ఆచీకట్లో ఎంతో శ్రమపడి ఒకరి కొకరు తాళ్లగట్టిగా బిగించుకున్నారు.

"దొరికిందా?" అన్నాడు మంగలి తాడులాగుతూ.

"దొరికిందిగాని నన్ను గుంజేస్తోంది," అన్నది మంగలి భార్య.

"పోనీమాకు, గట్టిగా పట్టుకో ....నన్నుకూడా గుంజేస్తోంది," అని కేక పెట్టాడు మంగలి. ఏమంటే, మంగలిపెళ్లాం పాతిన కొమ్మలకు కాలు తన్నిపట్టి బలంగా లాగసాగింది. అటు మంగలికూడా బలంకొద్దీ పెళ్లాన్ని గుంజసాగాడు.

"నిన్న తప్పించుకుపోయిన ట్టనుకున్నావా? బయటికిరా, నా తడాఖాచూపిస్తా," అన్నాడు మంగలి తాడులాగుతూ.






“నిన్న నా కళ్లల్లో కారం కొట్టి తప్పించుకు పోతావా? ఇప్పుడు నీ బావెవడు రక్షిస్తాడు?” అంటూ లాగింది మంగలి పెళ్ళాం.

వీళ్ల పెడబొబ్బలు నక్కబావ విన్నది. మంగలి దంపతులుపన్నిన వలలమధ్య అది లేనేలేదు. వేరే ఒకమూల పొదలమధ్య గోతిలో పడుకుని పగలల్లా నిద్రపోయింది. రాత్రల్లా నిద్రపోయింది. కాని అర్ధరాత్రివేళ మంగలి దంపతుల పొలికేకలమూలంగా నక్కబావకు నిద్రాభంగమైంది. వాళ్లు మధ్యమధ్య తనపేరే ఉచ్చరించటంచూసి తనజాడ కనిపెట్టారేమోనని భయపడిందికూడాను. కాని వాళ్ల మాటలు జాగ్రత్తగావింటే, వాళ్లు తాను దొరికిపోయినట్టే అనుకుంటున్నారని తెలిసింది.

ఏదో చమత్కారం జరుగుతున్నది చూదామని నక్కబావ అతి జాగ్రత్తగా దారిచూసుకుంటూ మంగలి దంపతులున్న చోటికి చేరుకున్నది. వాళ్లు ఒకళ్లనొకళ్లు గుంజుతున్నారని నక్కబావకు తెలిసిపోయింది. ఈ ప్రహసనంలో తానుకూడా పాల్గొనాలని నక్కబావకు బుద్ధిపుట్టింది.

“నన్ను లాగకండి, లాగకండి. నాకు బుద్ధివచ్చింది. చెంపలేసుకుంటా. ఈ సారికి నన్ను పోనివ్వండి,” అని అరిచింది నక్కబావ ఏడుపుగొంతుతో.

నక్కగొంతువినేసరికి మంగలికి పోతున్న బలమంతా తిరిగి వచ్చింది.

“ఇప్పుడు నీకు బుద్ధివచ్చిందేం? నాచేతిలో ఎట్లాగూ చావు తప్పదుగనక పై జన్మకీబుద్ధిపనికి వస్తుందిలే,” అన్నాడు మంగలి, బలంకొద్దీ పెళ్ళాన్ని లాగుతూ.

“ఇంకా నీమాటలు నమ్ముతాంగా? ఏమేనీవగలూ!” అన్నది మంగలిపెళ్ళాం మరింత గట్టిగా మొగుణ్ణి లాగుతూ.



"తల్లీ, చచ్చి నీ కడుపున పుడతా. నన్ను ఈసారికి వదిలిపెట్టు!" అని మళ్లీ నక్క దొంగఏడుపు ఏడిచింది.

ఈ సమయానికే మంగలి తన బలంకొద్దీ పెళ్ళాన్ని ఒక్క గుంజు గుంజేసరికి మంగలిపెళ్ళాం కిందపడి పోయింది. మంగలి ఆమెను కొమ్మల మధ్యగా పడేసి ఈడవసాగాడు. ఆయాసంతో మంగలి పెళ్ళానికి స్పృహతప్పి పోయింది. అందుచేత ఆమె మాట్లాడ లేదు.

పెళ్ళాం ఎప్పుడైతే, తనను లాగటం మానేసిందో, మంగలి నక్కబావ పని అయిపోయిందనుకున్నాడు. చేతిలో ఉన్నతాడు భద్రంగా పట్టుకుని కొమ్మల మధ్య ఇరుక్కుపోయిన పెళ్ళాందగ్గిరికి వచ్చాడు.

ఇదంతా చూస్తున్న నక్కబావ, "నీ కడుపు చల్లగా వెయ్యేళ్ళు బతుకమ్మా! నన్ను వదిలించి ఈసారికి నాప్రాణం రక్షించావు," అంటూ దూరంగా వెళ్లి పోయింది.

"నీ దొంగెత్తులు నాదగ్గిరనా? నేనెవడనుకున్నావు?" అంటూ మంగలి స్పృహతప్పి పడిఉన్న పెళ్ళాన్ని చీకట్లో పోల్చుకోలేక దుడ్డుకర్రతో చావబాదాడు.

ఈ దెబ్బకు స్పృహవచ్చి మంగలి పెళ్ళాం, "కుయ్యో, మొర్రో!" అంటూ లేచింది. ఈసమయానికి తూర్పు తెల్లవారుతోంది. ఇప్పుడు మంగలి తన పెళ్ళాన్ని గుర్తించి "ఓసి నువ్వటే? అయితే నక్కబావ ఏదీ? ఇంకేం? దాన్ని నువే విడిపించావూ?" అంటూ మళ్ళీ పెళ్ళాన్ని తన్ననారంభించాడు.

"నక్కబావను నేను విడిపించలేదు, మొర్రో!" అంటూ మంగలి పెళ్ళాం ఏడిచింది.

మొదట మంగలి పెళ్ళాన్ని నమ్మలేదు. కాని కాస్త వెలుతురువచ్చి తమ ఇద్దరిచేతులకూ ఉన్న తాళ్ళు చూసుకున్నాక, నక్కబావ దొరకనేలేదనీ, తెల్లవార్లూ ఒకరితో ఒకరు పెనగులాడారనీ తెలిసిపోయింది. రాత్రల్లా వాళ్లపడిన శ్రమకుతోడు నక్కబావ వచ్చి వాళ్లనుచూసి నవ్విపోవటం మరింత దుర్భరమయింది మంగలి దంపతులకు. తమనుతాము తిట్టుకుంటూ మంగలి దంపతు లింటికి పోయారు. నక్కబావకు శిక్ష జరగనేలేదు.



# నేటి పాపలు  రేపటి పౌరులు



"నీ చేతిలోది ఏమిటి?"



"చందమామ"

## జంటమాటలు

దారి – తెన్ను
గొడ్డు – గోద
పిల్ల – జెల్ల.
సిగ్గు – శరం
నోరు – వాయి
రాయి – రప్ప
మందు – మాకు
గుడ్డ – గోచీ
దూడ – దుడికి
రవ్వ – రద్ది
చీకు – చింతా

కరువు – కాటకం
దారి – తెన్ను
బిడ్డ – పాప
అంతు – పొంతు
మాట – మంతి
దగ్గిర – దాపు
అచ్చట – ముచ్చట
అన్నెము – పున్నెము

బీద – సాద
నిక్కు – టెక్కు
దారి – డొంక
కట్టె – కంప
మూట – ముల్లె
చెత్త – చెదారం
తుక్కు – దుమారం
దుమ్ము – దూ?
అల్లరి – ఆగం
దిక్కు – దిశ

[పాపలూ! మీకు ఇట్లాంటివి ఇంకా తెలిస్తే వ్రాయండి.]




తిరిగేకాలూ, తిట్టేనోరూ పూరుకుండవని మీకూ తెలిసేవుంటుంది. మన రామలింగంచేసే దుండగాలు రోజురోజుకూ మితిమీరి పోసాగినై. చిక్కిన వారినల్లా వదించకుండా వదిలేవాడుకాదు. ఆఖరుకు రాయలవారిని కూడా పరాభవం చెయ్యటానికి పూనుకున్నాడు. రాయలవారు ఆగ్రహించి రామలింగాన్ని అడివికి తీసికెళ్లి చంపమని యిద్దరు సేవకులకు ఆర్డరిచ్చారు.

సేవకులను ఎలాగో కల్లిబొల్లి కబుర్లతో మోసంచేసి, వాళ్లకు చెరో పదివరహాలు లంచంయిచ్చి రామలింగం ఆ గండం తప్పుకున్నాడు. సేవకులు వొక మేకనునరికి, రక్తంతోవున్న ఆ కత్తిని రాయలవారికి చూపారు. పాపం, రాయలవారు రామలింగం చనిపోయాడని నమ్మారు.

ఈ వార్త వూళ్లో అంతటా పొక్కిపోయింది. విన్నవాళ్లందరూ "రామలింగం చచ్చాడన్న మాటేగాని, వాడు బ్రహ్మరాక్షసిగా అయినా మనల్ని పీక్కు తింటాడు. బ్రహ్మహత్య మహాపాపం అంటారు. ఈ పాపం మనల్ని వూరికే వదలదు. దేశానికి వల్లమాలిన అరిష్టాలు చుట్టుకుంటై," అని గుసగుసలు మొదలు పెట్టారు.

ఈ గుసగుసలు చివరికి రాయలవారి చెవులకూడా బడినై. రాయలవారు పండితుల్ని పిలిపించారు. పాప పరిహారంగా శాంతి క్రియలు జరిపవచ్చని సలహా యిచ్చారు పండితులు. సరేనని, రాయలవారు, శాంతి క్రియలు జరిపించమని తాతాచార్యులవారిని పురమాయించారు.

తాతాచార్యులవారు, నూటఎనమండుగురు బ్రాహ్మలతో ఓ అమావాస్య అర్ధరాత్రి వేళకు వూరివెలపలవున్న మర్రిచెట్టుక్రిందకు శాంతి క్రియలు జరపటానికి చేరారు.



రామలింగం ఈ సన్నాహమంతా ఎలాగో ముందుగానే పసికట్టాడు. తాతాచార్యులవారు బృందంతో మర్రిక్రిందకు చేరకపూర్వమే రామలింగం, ఒంటినిండా ఎర్రనిలక్క, మొహానికి నల్లనిమసీ పూసుకుని చెట్టుమీదకు చేరి కొమ్మల చాటున దాగి కూర్చున్నాడు.

ఆచార్యులవారు, బ్రాహ్మణ బృందంతో హోమగుండంచూట్టూ చేరి మంత్రాలు చదువుతూ 'ఓ, బ్రహ్మరాక్షసీ,"అని పిలిచారు. కొమ్మల చాటునించి రామలింగం 'ఓ' అని పలికాడు. ఇది వినంగానే అందరూ తెల్లబోయి, "బ్రహ్మరాక్షసి స్వయంగా పలుకుతోందేమా ?" అని ఒకరి మొఖాలు ఒకరు చూసుకో సాగారు.

అదనుకు కాచుకునివున్న రామలింగం హఠాత్తుగా చెట్టుమీదినుంచి మొండిమొలతో వాళ్ళమధ్య హోమగుండం కాంతిలో బ్రహ్మరాక్షసికిమల్లే దూకాడు. "బ్రహ్మరాక్షసి వెంటపడనే పడిం"దని ఎవరికివారు ప్రాణాలు బిగబట్టుకుని పలాయనం చిత్తగించారు. తాతాచార్యులవారుకూడా ఒక్కపరుగున వచ్చి రాయలవారితో జరిగిందంతా విన్నవించారు.

రాయలవారు "బ్రహ్మరాక్షసి నా వెంట బడాల్సింది. మీ వెంట ఎందుకు బడ్డదబ్బా ?" అని అడిగారు.

"బహుశా, తమమీదికి రానివ్వకుండా మేము అడ్డుకున్నామని మా వెంట పడివుంటుం"దని ఆచార్యులవారు సమాధానపరిచారు, వేరే పాలుపోక.

"అలాగైతే, ఈ బ్రహ్మరాక్షసిని ఉచ్చాటన చేసినవారికి వేయివరాలిస్తామని చాటింపు వేయించండి," అని రాయలవారు ఉత్తరువిచ్చారు.

చూద్దాం ఉచ్చాటన ఎలా జరుగుతుందో !





కోడిపుంజు ఇంటిదోవ తప్పిపోయింది. ఇప్పుడు ఏదోవనుపోతే ఇంటికి చేరుతుందో చెప్పండి.



ఈబొమ్మ చూడండి. కోడికూస్తే కొబ్బరి చెట్టు వంగుతుంది. అప్పుడు మంగలాడు నదిదాటి కోటలో రాజుగారికి క్షౌరం చేస్తాడు. తన యిష్టం వచ్చినప్పుడల్లా మంగలి కోటలోకి పోతూంటాడు. అంటే కోడిచేత కూయిస్తూంటాడు. ఇది ఎట్లా సాధ్యమవుతుంది?

సమాధానం

57 పేజీలో చూడండి



## ముగ్గులు



పైన రెండు కుర్చీలు ఉన్నాయి. ఒకటి అన్నయ్యకీ, ఒకటి బావకీ. ఏది ఎవరికి వేస్తావో చెప్పు?

కూర్పు: ద్విభాష్యం పుల్లసరోజిని, దుర్గాడ.

---

## నీడ బొమ్మలు



ఎలుగుబంటి　　　కుక్క　　　ఆవు



# త్రోకపీకుడు గాడు

అనగా అనగా ఒకవూళ్లో వెంకయ్య అనే రెడ్డివున్నాడు. అతనికి బర్రెలు, ఆవులు, ఎద్లు, కోడెలు దాదాపు రెండు వందలదాక వున్నవి. వాటిలో కోడె దూడ వకటి భలే బాగావుంటుంది. ఆ వూళ్లో వకదొంగ దానిని కాజెయ్యాల వని యెన్నాళ్లనుంచో చూస్తున్నాడు. ఆనాడు ఎవ్వరికీ తెలియకుండా కొట్టములోకి వెళ్లి దూలంమీద దాక్కున్నాడు.

ఆవూరికి దగ్గర్లో ఒకచిన్న అడవి వుంది. దాంట్లో వక పెద్దపులివున్నది. ఆ పెద్దపులికి ఆరోజున ఆహారములేక ఒక కోడెదూడనైనా పట్టుకుతిందామని చీకటి పడ్డాక ఆ చావిట్లో ఒకప్రక్క పండుకొనివుంది.

బాగా చీకటిపడి అందరూ నిద్ర పోయాక దొంగవాడు దూలముమీద నుండి క్రిందకుదిగాడు. వాడు కావాలను కున్న కోడెకు యింకా కొమ్ములు రాలేదుకనుక వరసన అన్నిటికి నెత్తి మీద చెయ్యేసి తడుముతూ పులిదగ్గర కొచ్చి తడిమేడు. కొమ్ములు చేతికి తగల్లేదు. యిదేరా కోడెదూడ అనుకొని పైనయెక్కి కూర్చొని "ఛెయ్" అని తోలేడు.

పులి గాభరాపడింది. ఆ పులికి గిలి అంటే భయం. తనమీద యెక్కింది 'గిలి' అనుకొని భయపడి పరుగెత్తడం మొదలుపెట్టింది. తిన్నగా అరణ్యంలోకి దారితీసింది. తెల్లవారేటప్పటికి బాగా నట్టడవిలోపలికి పోయింది. తెల్లవార

కోట రామకోటేశ్వరరావు, వేజెండ్ల.



గానే తనెక్కింది కోడెదూడగాదు, పులి అని దొంగ గ్రహించాడు. యెట్లారా భగవంతుడా దీనిని తప్పించుకునేదని ఆలోచిస్తున్నాడు.

యింతలోకి పెద్ద పెద్ద వూడలు, దిగివున్న మర్రిచెట్టుక్రిందగా పెద్దపులి పోతున్నది. దొంగ ఒకవూడ పట్టుకొని చెట్టుమీదకు పారిపోయాడు. తనమీద వున్న గిలి పోయిందిగదా అని పులి పరిగెత్తుకుంటూ పోయింది. దారిలో పెద్దపులికి యెలుగుబంటి యెదురై "ఎక్కడికి పోతున్నావు పులిబావా!" అని అడిగింది.

పులి జరిగిన సంగతంతా చెప్పింది. అదివిని యెలుగుబంటి పకపకనవ్వుతూ "ఆ గిలిని నేను చంపుతా, రా! నేను చెట్టెక్కి ఆ గిలిగాణ్ణి క్రిందకుతోస్తాను. నీవు వెంటనే అదాటున గిలిగాడిమీద పడి చంపేయి" అంది.

సరేనంటే సరేననుకుని ఆ రెండు బయలుదేరి ఆచెట్టుదగ్గరకు వచ్చినై.



ఎలుగుబంటి చెట్టెక్కింది. పెద్దపులి క్రింద కాపలా కాస్తూ కూర్చుంది. యిది చూస్తున్న దొంగకి యేమీ తోచడంలేదు. యెలుగుగొడ్డు దగ్గరకు వస్తున్నది. దొంగ ఇంక లాభంలేదని వచ్చే యెలుగుగొడ్డుని వెనక కాలితోటి ఒక్కతన్ను తన్నేడు. ఆ తన్నుకి పట్టువదిలి యెలుగుగొడ్డు క్రిందపడింది. గిలిగాడు క్రిందపడ్డాడని పులి ఎగిరి ఎలుగుగొడ్డుమీద దూకింది.

"బావా నేనుయెలుగుగొడ్డుని; చంపమాకు. వీడు గిలిగాడు కాదు, వెనకతన్నుడుగాడు. యిక్కడున్నామంటే అన్యాయంగా చంపుతాడు" అని పెద్ద పులిని వెంటపెట్టుకొని అక్కడనుంచి



వెనక్కి తిరిగి చూడకుండా ఒకటేపరుగు పరిగెత్తిపోయింది.

అట్లా పోతుండగా వాళ్ళకి నక్క బావ యెదురై "ఏమిటలా పరుగెత్తుతున్నా?"రని అడిగింది.



"మన అరణ్యంలోకి గిలిగాడు వచ్చాడు" అని పెద్ద పులి అంది.

"కాదు వెనక తన్నుడుగాడు వచ్చాడు" అని యెలుగుబంటి అన్నది.

నక్క పెద్ద పెట్టున నవ్వి "ఓరి పిచ్చివాళ్ళల్లారా! ఈభాగ్యానికే పరిగెత్తిపోతున్నారా? గిలిగాడేమిటి? వెనక తన్నుడుగాడేమిటి? మీరు పారిపోవటమేమిటి? మీ పరాక్రమం మండినట్టే ఉంది. వెనక్కు పదండి. వాడి అంతు నేను కనుక్కుంటాను" అని ప్రోద్బలం చేసి, ఆయిద్దర్నీ వెనక్కు తిప్పింది.

దొంగ యింక ఇక్కడవుంటే లాభంలేదని దగ్గర్లోనే పాడుబడ్డ గుడివుంటే దాంట్లోకి వెళ్ళి తలుపు బిగించి కూచున్నాడు. నక్క, పెద్దపులి, యెలుగుగొడ్డు ఆ చెట్టు దగ్గరకు వస్తే వాడు అక్కడలేడు.

"నేను చెప్పలేదా? మనం వచ్చే లోపల వాడెక్కడో దాక్కున్నాడు. పిరికివాడు కాకపోతే దాక్కుంటాడా? ఇక్కడ దాక్కునే టందుకు మాత్రం ఏముంది, ఈ గుడితప్ప. రండి, ఈ గుళ్లో ఉన్నాడేమో చూతాం" అని నక్క పులినీ, యెలుగుగొడ్డునూ గుడి దగ్గిరికి తెచ్చింది.

గుడి తలుపులువేసి ఉన్నై. గుడి తలుపు తీయాలని నక్క ప్రయత్నం చేసింది, కాని సాధ్యపడ లేదు. చివరకు నక్క విసిగి ఆ తలుపు బొక్కగుండ తోకదూర్చి గడియ తీద్దామని ప్రయత్నించింది. యిది దొంగ చూచి దాని తోక పట్టుకున్నాడు. నక్క ఇకిలించటం మొదలుపెట్టింది.

నక్క యికిలింపుచూసి ఎలుగు గొడు-"ఏం, నక్కబావా? ఇకిలిస్తున్నావెందుకూ?" అని అడిగింది.

"ఇకిలించందీ పికిలించందీ ఎన్నాళ్ల కిందటో వేసిన ఇనపగడియలు వస్తాయా?" అన్నది నక్క.

ఈవిధంగా కాసేపు దొంగా నక్కా పీకులాడేవరకు నక్కతోక కాస్తా తెగిపోయింది.

నక్క బ్రతుకుజీవుడా అని పరిగెత్తటం మొదలుపెట్టింది. పులీ, ఎలుగుగొడ్డూకూడా వెంట పరుగెత్తి-"నక్కబావా, నక్కబావా? గుళ్ళో ఉన్నది ఎవరు?" అని అడిగినై.

"గుళ్ళోఉన్నది గిలిగాడూ కాదు; వెనకతన్నుడుగాడూ కాదు; తోకపీకుడుగాడు!" అని అదే ఉరుకుఉరికింది.

పాపం దొంగ ఇక "దూడలేకపోతే పోయింది. ప్రాణమన్నా దక్కింది కదా" అని ఇంటికి చేరుకున్నాడు.








ఒకఊళ్లో ఆ స్త్రిపరురాలైన అవ్వ ఉండేది. ఆవిడకు పదేళ్ల మనమరాలు ఉండేది. అవ్వ మనమరాలిని వల్ల మాలిన అదుపులో వుంచేది. ఎక్కడికీ పోనిచ్చేదికాదు. ఇంటికొచ్చిన పిల్లలతో ఆడుకోనిచ్చేది కాదు. అందుకని మన మరాలు అవ్వ ఇంటో లేనప్పుడల్లా గట్టిగా "ఈ ముసలిముండ చచ్చినా బాగుండును," అనుకుంటూ ఉండేది.

ఆ ఇంటో అవ్వా మనమరాలూ కాక ఒక చిలకకూడా ఉంది. దాన్ని మనమరాలు పెంచుతూ ఉండేది. కొద్ది రోజుల్లో ఆచిలకకూడా మనమరాలు మాటిమాటికీ అనుకునేమాటలు నేర్చుకున్నది. ముసలమ్మ స్నేహితురాళ్లు ఎవరైనా ఆమెదగ్గిరకివచ్చి మాట్లాడుతున్నప్పుడు "ఈ ముసలిముండ చచ్చినా బాగుండును" అని అనేది.

ఈమాట మొదటిసారి విన్నప్పుడు అవ్వ నిర్ఘాంతపోయింది. దాని కటువంటిమాటలు ఎట్లాపట్టుబడిందీ అవ్వకు తెలియలేదు. మనమరాలుమీద అవ్వకు అనుమానం పోలేదు. ఎందుకంటే తన ఎదుట మనమరాలెంతో అమాయకురాలల్లే కనిపించేది.

అస్తమానమూ చిలక "ఈ ముసలి ముండ చచ్చినా బాగుండును," అంటూ ఉంటే దానిచేత ఆ దుర్భాషలు మానిపించటం ఎట్లాగో అవ్వకు తెలియలేదు. అందుకని పొరుగునిఉన్న ఒక సద్బ్రాహ్మడి యింటికిపోయి, "శాస్తుల్లుగారూ, శాస్తుల్లుగారూ, మాయింటో



చిలక దిక్కుమాలిన మాటలన్నీ నేర్చుకుంటోంది. దానికా దురలవాట్లు పోగొట్టి నాలుగు మంచిముక్కలు నేర్పడం ఎలాగా?" అని అడిగింది.

దానికి శాస్తుల్లుగారు దీర్ఘంగా ఆలోచించి, ఇలా అన్నాడు. "దానిదేముంది? ఒక పని చేదాం. మా యింటో ఒక చిలక ఉంది. అది అన్నీ మంచి ముక్కలే మాటాడుతుంది. నాలుగు రోజులపాటు మీచిలక్కి మాచిలకతో పొత్తుకలిపితే, మీచిలక మాచిలకదగ్గిర్నుంచి ఆ నాలుగు మంచిముక్కలూ నేర్చుకోవచ్చు" అన్నాడు.

"బాబు, బాబు! మీ చిలకని నాలుగు రోజులు అరువిత్తురూ?" అంది అవ్వ. 'దానికేంభాగ్య' మన్నాడు శాస్తుల్లుగారు.

అవ్వ శాస్తుల్లుగారి చిలకనుతెచ్చి తన మనమరాలిగదిలోఉన్న పంజరంలో చిలకతోపాటు ఉంచేసి ఒక్క నిట్టూర్పువిడిచింది.

ఇంతలోనే ఇంటిచిలక, "ఈ ముసలి ముండ చచ్చినా బాగుండును" అన్నది ముక్కు గీరుకుంటూ.

వెంటనే శాస్తుల్లుగారిచిలక ఇంటి కప్పుకేసిచూసి, "తథాస్తు! నీఅభీష్టం సిద్ధించుగాక!" అన్నది.

అవ్వ ఇదివిని మండిపోయింది. పంజరంతెరిచి రెండుచిలకలనూ వొదిలి పెట్టేసింది. పోయిచావండిఅని తిట్టింది.




ఒకనాడు ఒక కుందేలుపిల్ల తల్లికి చెప్పకుండా నదిలో నీళ్లు తాగబోయి నదిలో పడిపోయింది. వరదలు కావటం చేత నది జోరుగా ప్రవహిస్తున్నది. అదృష్టవశాత్తూ నది కెరటాలు కుందేలు పిల్లను ఒక లంకమీదికి చేర్చాయి. చావు తప్పి కన్ను లొట్టబోయి కుందేలు పిల్ల ఆ లంకమీద నివాసం ఏర్పరచుకున్నది.

లంకనిండా పచ్చని గడ్డీ, ఆకుల చెట్లూ, పొదలూ ఉన్నాయి. కుందేలుకు కావలసినంత ఆహారం. కాని, పాపం, మన కుందేలుకు తోడులేరు. ఆ లంక మీద మన కుందేలు తప్ప మరో ప్రాణి లేనేలేదు. ఈ విషయం కుందేలుకు చాలా దిగులుగా ఉంది. విచారం జాస్తి అయినప్పుడల్లా మన కుందేలు నది ఒడ్డుకువచ్చి దూరాన కనిపించే అవతలిగట్టును చూస్తూ కూచునేది. అక్కడ ఉన్న తనవారందర్నీ తలుచుకుని కంట నీరుకార్చేది. వారినిచేరే ఉపాయం లేదే అనుకుని పెద్దపెట్టున ఏడ్చేది.

ఒక రోజున మన కుందేలు నది ఒడ్డున కూచుని ఏడుస్తుండగా నీటిలో ఏదో చప్పుడయింది. కొంచెం జాగర్తగా పరికించిచూస్తే ఏదో చిన్న దుంగ లాటిది తేలుతూ కనిపించింది. కాని అది దుంగకాదు; మొసలి. ఈ సంగతి మన కుందేలు గ్రహించింది.

మొసలిని చూడగానే మన కుందేలుకు పట్టరాని అసూయ కలిగింది. మొసలి హాయిగా ఆ ఒడ్డునుంచి ఈ

ఒడ్డుకు క్షణంలో ఈదగలదు. తనకా భాగ్యం లేదుకద! కావాలంటే ఈ మొసలి తనని క్షణంలో అవతలి ఒడ్డుకు చేర్చగలదు. కాని మొసలిది కుళ్లబుద్ధి. అందుచేత దాన్ని ఉపకారం అడిగి లాభంలేదు.

ఇంతలో మన కుందేలుకు ఒక చక్కని ఉపాయం తట్టింది. మొసలిని మోసంచేసి అవతలి ఒడ్డు చేరటానికి మన కుందేలు ఒక పన్నాగం పన్నింది.



"మొసలిబావా, మొసలి బావా! నిన్ను నేను కని పెట్టాలే," అన్నది కుందేలు.

నీళ్లలో కదలకుండా తేలుతుంటే తన్నెవరూ కనుక్కోలేరని మొసలి నమ్మకం. తన రహస్యం కనుక్కుం దెవరా అని మొసలి తలపైకెత్తి కుందేలును చూసింది.

"నీటిలో ఎంతసేపు నానుతావు? కాస్సేపు ఇట్లావచ్చి ఈ గడ్డిమీద ఎండలో ఆరుదువుగాని రా!" అని కుందేలు మొసలి నాహ్వానించింది.

మొసలి పైకివచ్చింది. మొసలీ కుందేలూ కాస్సేపు అదీ, ఇదీ మాట్లాడు కున్నారు. చివరకు కుందేలు మొసలితో, "మీ జాతిని చూస్తే నాకు చాలా విచారం. మీకు దేవుడు చక్కని రూపం ఇచ్చాడు. ఎంతో తెలివితేటలిచ్చాడు. కాని, పాపం మీ జాతికి ఎదుగూ బొదుగూ లేదు. మా కుందేళ్లు మీలాగా నూరేళ్లబతకలేక పోయినా, కొద్దిరోజుల్లోనే వందలేసి మునిమనమలని ఎత్తుతాం. ఎంత ప్రదేశమైనా సరే ఇట్టె ఆక్ర మించేస్తాం? మీకు, పాపం, ఆ అదృష్టం ఇవ్వలేదు భగవంతుడు," అన్నది, విచారం నటిస్తూ.

ఈ అబద్ధం మాటలు వినేసరికి మొసలికి ఆశ్చర్యమూ, ఏడుపూ వచ్చాయి.



అబ్బాయి: ఏయ్ పోలీసూ! మా అమ్మా, నాయనా, అన్నా తప్పిపోయారు. వాళ్ళని పట్టియిస్తావా?

"నువు చెప్పేది పచ్చి అబద్ధం. ఒక్కొక్క ఆడమొసలీ లక్షలేసి గుడ్లు పెడుతుంది. శాస్త్ర పుస్తకాల్లో నువ్వా సంగతి చదవలేదా? మాతో పోలిస్తే మీ కుందేళ్లేపాటి?" అన్నది మొసలి.

'పుస్తకాల్లో ఎన్నో అబద్ధాలు రాస్తారు. మీ గుడ్లను మీరే తింటారనే అపఖ్యాతికూడా ఉన్నది. నేను ప్రత్యక్ష సాక్ష్యంలేందే నమ్మను. ఇంత కాలంగా నే నిక్కడ ఉంటున్నాను గాని ఒక్క మొసలినికూడా చూడలేదు," అన్నది కుందేలు.

"కో అన్నా నా అంటే కోటి మొసళ్ళు వచ్చేస్తాయి," అన్నది మొసలి.

"ఏదీ నీవాళ్ళందర్నీ పట్టుకురా చూతాం," అన్నది కుందేలు.

మొసలి వెంటనే వెళ్ళి ఒక్క క్షణంలో ఒక బ్రహ్మాండమైన మొసళ్ళ దండుతో తిరిగివచ్చి, "ఇప్పుడేమంటావు?" అన్నది.

కుందేలు మొసళ్లనన్నిటినీ చూసి, చప్పరించింది. "ఇంతేనా? మీరంతా వరసన పడుకున్నా, ఈ ఒడ్డునుంచి ఆవొడ్డుదాకా చాలరు." అన్నది.

మొసలికి మరింత రోషంవచ్చింది. "అది నిజమో, అబద్ధమో నీ కిప్పుడే చూపిస్తాను," అంటూ మొసలి తన వారి నందరినీ నదికి వంతెనకట్ట మన్నది. వెంటనే మొసళ్లన్నీ ఈ వొడ్డునుంచి ఆవొడ్డుదాకా పరుచుకుని పడుకున్నాయి.

"అమ్మయ్యో, మొసలిబావా. నీవు చెప్పింది నిజమే. అయినా మీవి చాలా పొడుగుపాటి శరీరాలు. ఇంతకూ

మీరంతా కలిసి వందమంది అయినా లేకపోవచ్చు. ఎంచిచూస్తేగాని ఎంత మంది ఉన్నదీ తెలియదు.'' అన్నది కుందేలు.

"ఎందుకో!" అన్నది మొసలి దర్పంగా.

"ముందునేను మీవాళ్ళనెంచుతాను. తరవాత మావాళ్ళను నువ్వెంచుదువు గాని. మీవాళ్లను కదలకుండా ఉండ మను. నేను వాళ్ళవీపులమీదుగా ఎంచు కుంటూ పోయి తిరిగివస్తాను," అన్నది కుందేలు.

మొసలి సరేనన్నది.

"ఒకటీ, రెండూ, మూడూ, నాలుగూ,ఐదూ"....అని ఎంచుకుంటూ, ఒక మొసలి వీపుమీదినుంచి మరొక మొసలి వీపుమీదికి ఎగురుకుంటూ, కుందేలు క్షణంలో నది అవతలవొడ్డుచేరి, ఆఖరు మొసలివీపుమీదినుంచి వొడ్డుకు దూకింది.

కుందేలు ఏమంటుందో వినాలని ఈదుకుంటూవచ్చిన మొసలి నిర్ఘాంత పోయి చూడసాగింది. ఎందుకంటే, కుందేలు చేతులతో పొట్టను వొత్తు కుంటూ నవ్వసాగింది.

"ఎందుకు నవ్వుతావు?" అన్నది మొసలి.

"నీతెలివికి!" అన్నది కుందేలు. "నీకెంత శరీరంఉండి ఏంలాభం? నీ వాళ్లెంతమంది ఉంటే ఎవడిక్కావాలి? నీతలకాయలో దేవుడు మట్టిపెట్టాడు. అందుకనే నేనీ వొడ్డుచేరగలిగాను," అన్నది కుందేలు.

మనకుందేలు ఇంతకాలానికి మళ్ళీ తనవారిని కలుసుకుని, పెళ్లిచేసుకుని, గంపెడు పిల్లల్నికని సుఖంగాఉంది.





# జోల పాటలు

ఏటిగట్టూమీద కరివేపచెట్టు
గాలివానావచ్చి కొమ్మలల్లాడె
కొమ్మలల్లాడెనే గొలుసులల్లాడె
కొని కొన్నిముత్యాల చేరులల్లాడె.

పిల్లీ, పిల్లీ, పిల్లలకు తల్లి
పల్లేరు ముళ్లల్లో పాలిచ్చిపోవె
పిల్లలకు పాలోసి పల్లెలకుబంపు
అబ్బాయికి పాలోసి అడుకోబంపు.

ఆ చెట్లపైనుండి అబ్బాయి రాగ
బంగారు తలపాగ చెంగులల్లాడె
ఏవాడ వెళ్లేవు అబ్బాయి నువ్వు
ఎవ్వారు కట్టేరు కాళ్ల మువ్వల్లు?

కలవారిపట్టనీ గారాములన్నీ
కంచరీ కట్టేడు కంచు మువ్వల్లు
తనతోడి పట్టనీ తనకు ముద్దన్నీ
అన్నయ్య కట్టేడు వెండి మువ్వల్లు.

వీధి నెందరువున్న విసరదా గాలి?
రచ్చ నెందరువున్న రాదమ్మ వాన?
నాచిన్ని అబ్బాయి వీధి నిలుచుంటె
మొగలి పువ్వుల గాలి, ముత్యాల వాన!

అబ్బాయి మామల్లు యెటువంటివారు
చెవికి చారడేసి పోగుల్లవారు
అంచు పంచెలవారు - అంగీలవారు
పట్టు పంచెలవారు - పాగాలవారు

పెసరకాయలవంటి పెదిమెల్లవారు
కందికాయలవంటి కనుబొమలవారు
మిరపకాయలవంటి మీసాలవారు
వారు మా అబ్బాయి మేనమామల్లు-

తమలపాకులమీద లేఖల్లు వ్రాసి
తమ్ముడంపినాడె తన ముద్దుమాట;
తనముద్దు మాటొకటి దబ్బపండొకటి
నాచిన్ని తమ్ముడా రార అబ్బాయి.

ఏటిగట్టూ మీద సంధ్యల్లు వార్చె
ఎఱ్ఱన్ని చినవాడు ఎవరి అబ్బాయి
నాగగంధపు చెవుల పోగులున్నాయి
నా మేన అల్లుడా రార అబ్బాయి.

సూర్యుడూ, చంద్రుడూ అన్నదమ్ముల్లు
సూటి గుఱ్ఱాలెక్కి జూదమాడేరు
అబ్బాయి తమ్ముడూ అన్నదమ్ముల్లు
లక్కపావాలెక్కి లెక్కరాసేరు.

గంధమ్ము తీసిన్న సాన చల్లన్న
సభలోన అబ్బాయి మాటచల్లన్న
ఇందూవ తీసిన నీళ్లు చల్లన్న
ఇంట్లోని అమ్మాయి కడుపు చల్లన్న.

ఊరికీ వుద్యోగి రాజు వచ్చేడు
విడిమట్టు చూపండి విందు నాయిల్లు.
ఊరికీ వుద్యోగి రాజు అబ్బాయి
విడిమట్టు నీయిల్లు విందు నాయిల్లు.

సంపాదన: దీవి భానుమతీదేవి

చిక్కుడూ పువ్వెరుపు చిలుక ముక్కెరుపు
చిగురెరుపు చింతల్ల, దోరపండెరుపు
రాచవారిళ్లల్లొ మాణిక్య మెరుపు
తానెరుపు అమ్మాయి తనవారిలోన.

గోపాలకృష్ణమ్మ పెళ్లయ్యె నాడు
గోరింట పూచింది కొమ్మలేకుండ!
మాయింటి అబ్బాయి పెళ్లయ్యెనాడు
మల్లెల్లు పూచేయి మొగ్గలేకుండ!

వేసంగి కాలాన ఓ పెళ్లికొడక
వేప తోరణాల నీడనే రమ్మ
మాయింటి అబ్బాయి పెళ్లయ్యెనాడు
మామిడి తోరణాలు మరిదూరి రమ్మ.

ఏనుగూ యెక్కయే ఓరాజు రాగ
ఏక దివాణమ్ము యెవరి లోగిలి?
పల్లకీ యెక్కయే ఓరాజు రాగ
బంగారు తలుపుల్లి యెవరి లోగిలి?
అందలా లెక్కయే ఓరాజు రాగ
అద్దాల తలుపుల్లి యెవరి లోగిలి?

ఏనూగ ఎక్కయే అబ్బాయి రాగ
ఏక దివాణమ్ము వదినె లోగిలి.
పల్లకీ యెక్కయే అబ్బాయి రాగ
బంగారు తలుపుల్లి వదినె లోగిలి.
అందలా లెక్కయే అబ్బాయి రాగ
అద్దాల తలుపుల్లి వదినె లోగిలి.

చిలకలాడేనమ్మ హంసలాడేని
పావురా లాడెను పందిళ్లలోన
చిలకనా అబ్బాయి, హంస అమ్మాయి
పావురం కుర్రాడు పందిళ్లలోన.

పిల్లమ్మ కన్నుల్లు బీరపువ్వల్లు
అబ్బాయి కన్నుల్లు కలువరేకుల్లు
కలువ రేకులవంటి నీ కన్నులాకు
కాటుకలు పెట్టుతే నీకు అందమ్ము.

చింత చెట్టూక్రింద చిటిబొమ్మరిళ్లు
వాటికీ వాకిళ్లు బోరు తలుపుల్లు
బోరు తలుపులకింద పొందైన మేడ
ఆమేడ నున్నాయి రెండు హంసల్లు.
ఆరెండు హంసల్ల పేరేమి పేరు
రాచిలుక అబ్బాయి - రంభ అమ్మాయి
చిలుకలకు చెలికాడు తాను అబ్బాయి
హంసలకు చెలికత్తె తాను అమ్మాయి
ఆ యిద్దరీ అయ్య చందమామయ్య.

తూర్పునా అబ్బాయి, యిల్లుకట్టేడు
దూలాల మోసేరు, దూదిపరుపుల్లు
పడమటా అబ్బాయి, యిల్లుకట్టేడు
పట్టెల్ల మోసేరు పాలకావిళ్లు
దక్షిణా నబ్బాయి, యిల్లుకట్టేడు
దండెల్ల పోసేరు ధనము పెట్టెల్ల
ఉత్తరా నబ్బాయి, యిల్లుకట్టేడు
ఊరికే వచ్చింది ఊరంత చోటు.






## ఆ రాత్రి

యస్. జఘు, కాకినాడ.

రాత్రి వర్షం బాగా కురుస్తుంది. చలిగాలి కూడ వేస్తున్నది. "నిద్రపోతానే అమ్మా" అనిచెప్పేను. "అప్పుడే ఏమిటిరా?" అంది అమ్మ. ఇక లాభములేదని 'తలనొప్పే' అని ఏడ్పు మొఖం పెట్టేను.

"పో, ఎప్పుడూ, ఏదో ఒకవంక; చదువూ లేదు సంధ్యాలేదు" అని కసిరింది.



నాకు అమ్మతో పడుకోవడం అలవాటు. అమ్మప్రక్కన పక్క వేసి పడుకోనిదే నిద్ర రాదు. అందుకని "నువ్వే" అన్నాను. "ఏమిటిదిన్నరకే నన్నుకూడా పడుకోమంటా వేమిటిరా? నీకు నిద్రవస్తే పడుకో, నేను రాను....లేకపోతే చదువుకో" అన్నది.

నిద్ర ముంచుకువస్తోంది. కాని పైకి వెళ్ళి పడుకోవడము భయం. సాయంత్రం అమ్మమ్మచెప్పిన దయ్యముకథ యింకా తలలో మెదులుతునేవుంది. ఐనా మెల్లిగా ఒక్కొక్క మెట్టెక్కి పైకిపోయి, దీపము పెట్టి పడుకొన్నాను....

రాత్రి మెలకువొచ్చింది. దాహమేసింది. అమ్మకోసం ప్రక్కన చూచాను. అమ్మ లేదు సరిగదా మంచం కూడాలేదు. గుండె గతుక్కుమన్నది. వర్షమింకా కురుస్తునే ఉన్నదని తెలుసుకొన్నాను. అమ్మ గదిలో లేదు. భయమేసింది. దీనికితోడు దీపం కూడా ఆరిపోయింది. "మంచినీళ్ళు ఎలా దొరుకుతాయి?" అని అటుఇటుచూశాను....

మొదటి బహుమతి పొందిన పోటీ వ్యాసం.

చూడగానే గోడవద్ద ఎవరో నిలుచుని వున్నట్లు కనిపించింది. ఇంకా కొంచెము సరిగ్గా చూచాను చీకట్లో

చేతులుచాచుకొని ఎవరో గాలిలో, పాదాలు భూమికి అంటనీయకుండ నుంచొనివున్నారు. నాకేసిచూచి నవ్వు తూన్నట్లుగా కనిపించింది. పాదాలులేవు, హస్తాలులేని మనిషి.... కాదు దయ్యము; నాకేసిచూస్తూ నవ్వుతూ, చేతులుచాపి నన్ను రమ్మంటుంది. 'అమ్మా' అని కేక వేదామనుకొన్నాను నోరెండిపోయింది.... వణుకుతున్నాను.

గాలివేసింది. దానితో మహా కదిలింది దయ్యం. చేతులు మరింత దగ్గిరికిచాపి నన్ను మంచంమీదినుంచి ఎత్తుగాపోయింది. భయంతో దానిచేతుల కందకుండా మంచంమీద జరిగిజరిగి "దభేలు"మని మంచంమీదనుంచి పడ్డాను....'ఏరా చిట్టీ?' అని గాబరాగా అడిగినాడు. ఎవరు? మా అన్నరామం. "ఎప్పుడు వచ్చాడురా" అనుకొన్నాను. అన్నయ్య నన్ను ఎత్తుకొని మంచంమీద పడుకోబెట్టి "ఏమిటి?" అని ఆదుర్దాగా అడిగేడు.

"దయ్యం!" అనిమాత్రం చెప్పగలిగేను.

"ఏది?" అని నవ్వుతూ దీపమేశాడన్నయ్య. దయ్యమున్న గోడకేసిచూచాను. అన్నయ్య పంట్లాము, కోటు, హేటు, కొయ్యకు తగిలించివున్నాయి.



అన్నయ్య రాత్రి 9 గంటలబండిలో వచ్చాడట. ఆసంగతి నాకు తెలియదు. వచ్చి. నే పడుకొన్నగదిలో చిలకు తన సూటు తగిలించి. గదిలో గాలివస్తుందని, అమ్మబదులు మంచంమీద పడుకొన్నాడు. కాబట్టి అమ్మ క్రిందగదిలో నిద్రపోయింది. ఇదంతా నాకు తెలియదు. కాబట్టి అమ్మ లేని సమయంచూచి దయ్యం నన్ను తీసుకెళ్ళడానికి వచ్చిందని భయపడ్డాను.

నేనేమీ మాట్లాడకుండా ఆ బట్టలకేసి చూస్తుండడముచూచి అన్నయ్య "ఇదేనా దయ్యం" అని నవ్వేడు. అన్నయ్యతో పాటు నేనుకూడా నవ్వేను....




అబ్బాయిలూ, అమ్మాయిలూ!

మీరు పెద్దవాళ్ళసహాయం లేకుండా సొంతంగా ఆలోచించి ఈ పజిలు పూర్తి చేయాలి సుమా. అలా పూర్తిచేసి 12 పేజీలో ఉన్న జవాబుతో సరిచూచుకొండి. ఒక్క తప్పుకూడా లేకపోతే మీకు పది మార్కులు. ఒక తప్పుంటే ఆరు మార్కులు. రెండు తప్పులుంటే నాలుగు మార్కులు. మూడు తప్పులుంటే రెండుమార్కులు. నాలుగుగాని అంతకుమించిగాని తప్పులుంటే మాత్రం బండిసున్నా వచ్చినట్లే.

పోతే, దీన్ని పూర్తిచేసేపద్ధతి మీకు తెలుసునా? 1 నెంబరు అడ్డంలో ఐదు అక్షరాలు వుండాలి. ఆధారములలో "మనదేశస్థుడు" అని వుందా, దానికి ఐదు అక్షరాల మాట ఏమైయ్యుండాలి అని ఆలోచించాలి. 'భా' 'డు' ఇచ్చివున్నవి. మిగతా మూడు అక్షరాలు నింపిచూడండి.

అలాగే 2 నెంబరు నిలువు రెండు అక్షరాలు వుండాలి. ఆధారములలో 'సూర్యుడు' అని వుంది. దానిని వెతకటానికి సూర్యుడు పేర్లు ఏమిటా అని ఆలోచించి పూర్తిచెయ్యండి. అట్లాగే తతిమ్మా గళ్లు పూర్తిచేసి మీ మార్కులు నాకుచెప్పండి.





## ఆధారములు

అడ్డము :

1. మన దేశస్థుడు.
6. వైరాగ్యము.
8. భూమి.
10. సగము.
11. ముక్కుతో చూచేది.
12. ఒక చిన్న జంతువు
13. ముర (తలక్రిందుగా).
15. కథ.
16. ఆడపిల్ల.
18. 130.

నిలువు :

2. సూర్యుడు.
3. ఒడ్డు.
4. ఉపాయము.
5. ఒకవారము పేరు.
7. నవరత్నములలో ఒకటి.
9. కొన్ని కాయలలో ఉండేది.
10. కోపము.
14. యోగివేమన...చూశారా?
16. దారి.
17. వెకవెక లాడునది.

---

40 వ పేజీలోని చిక్కుబొమ్మకి జవాబు

మంగలి కోడిచేత కూత వేయించ దలచుకున్నప్పుడు పొదిలోనుంచి అద్దంతీసి చూపేవాడు. అద్దంలో కోడినిచూసి కోడిపుంజు కూతవేసేది.

## చందమామ

### పోటీవ్యాసం

క్రిందటినెల పోటీ వ్యాసాలలో మొదటి బహుమతిపొందిన "ఆరాత్రి" అనే కథ ఈ సంచికలో వేశాము. దీన్ని వ్రాసింది, యస్. జయ, రామారావుపేట, కాకినాడ.

రెండవబహుమతి "గంగులు కథ" అనే కల్పనాకథకు యిచ్చాము. దీన్ని వ్రాసింది, బొర్రా ప్రసన్నకుమారి, దుర్గాడ. ఈకథ నవంబరు 'చందమామ'లో ప్రకటిస్తాము.

మూడవబహుమతి నిర్ణయంకూడా వచ్చే సంచికలో ప్రకటిస్తాము.

సంచాలకుడు :

చందమామ

---

స్వీకారము :

### బాలబంధు

"బాలబంధు" కొత్త పిల్లల మాసపత్రిక, చక్కనిబొమ్మలతో మంచి రచనలతో సెప్టెంబరులో వెలువడింది. వెల 0-2-0. బాలబంధు తెలుగునాట బాగా ప్రచారం కావాలని మా కోరిక. చిరునామా: 39, ఆండర్సన్ వీధి, మద్రాసు 1.



(3) దుఃఖరసం

ఈ మూడు ఫొటోలు మార్కస్ బార్ట్లే తీసినవి.




Printed and Published by B. N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras 1,
Editors : CHAKRAPANI and K. RAJA RAO.

PRINTED AT THE B. N. K. PRESS, 37, ACHARAPPAN ST. MADRAS - 1